# విషయసూచిక.

# అంకితము.

చిన్నతనాట్టి జీవిత మశేషముఁ
జిజ్ఞాసమ్మై వెలింగి భా
గాక్రీస్తుఁగూర్చి నాకు సమ
యుఁచిత్రభంగుల ముక్తికాంత ప్ర
చ్ఛన్నసతీస్వరూపమున
జూయగనొప్పెఁ, దదంకితంబుగా
సన్నుతిపాత్రమౌ కృతి
నొసంగితి, దేవి! పరిగ్రహింపుమీ !

శ్రీ

# తత్త్వమీమాంస.

## ఉపక్రమణిక.

---

ఉ. శ్రీకర దివ్యలీలల నశేషజగంబుల సృష్టిఁ జేసి, యు
వ్యాకృత వైభవంబు లెసలారఁగఁ బాలన మాచరించి, ప్ర
త్యేకత నాత్మయందు విలయింపఁగఁ జేయు వినోదశాలి, సు
శ్లోకుఁడు దైవ మీ సకల లోకములన్ దయ నేలుఁగాతన్. 1

సీ. ఏపరేశు నమోఘహృదయసంకల్పముల్ బ్రహ్మాండపుండలోత్పాదనములు
ఏచిదాత్ముకటాక్షవీక్షణాసారముల్ జీవకోట్లకు సుధాసేచనములు
ఏమహామహునియుద్దామ వాగ్వైభవముల్ మునిజనసంశయోన్మూలనములు
ఏదయాళు నిరంకుశోదార కృత్యముల్ ప్రాణిసంరక్షా పరాయణములు

గీ. అట్టి పరమేష్ఠి పదనగహ్వరచతుష్ట | యంబునుండి యనాది కాలంబునందు
నాశుధారాప్రవాహసామ్యంబుదోఁప నిగమగణితామ్నాయసముదాయ మవతరించె

ఉ. ఆ నిగమంబు లెన్నఁగ ననంతము లై వరధర్మబోధనా
స్థానము లై జగత్స్థితి విధానము లై పురుషార్థ సాధనో
ద్యానము లై మహాగుణ నిధానము లై విలసిల్లి సంతతా
నూన కలావిలాసముల నొప్పుచునుండెఁ జగత్త్రయంబునన్. 3

గీ. అట్టియామ్నాయనిచయమహాంబురాశి। యందలిమహత్తరార్థంబు లఖిలజనుల
కాది నెంతయు దురవగాహములుగాఁగ, వాని విభజించె నప్పుడా వ్యాసమౌని.

చ. ఎనసిన యగ్రంథములెట్లు భరియింపఁగ శక్యముగాని వేదరా
శిని విడఁదీసి కొంత సనిజేసిన వ్యాసమునీంద్రు దివ్యశో
ధనమున నాటనుండియు నుదారతఁ శ్రుతిసంచయంబు న
మ్మునివరులెల్ల శిష్యులకు బోధయొనర్చుచు నుండి రాదటన్. 5

గీ. ఆకులారావు, గంటంబు లసలెకావు, । కాగితంబులు కలము లెక్కడను లేవు;
ఒక్కయక్కరమైన వ్రాయుటు పనిలేక। యెల్ల శ్రుతులను వల్లించి రెల్ల ఋషులు.

క. కేవల లౌకిక సద్గ్రం। థావళియుం బోలెఁ గాక యతిమహితంబౌ
నా వేదరాశి యిలఁ బ్ర। స్తావింపంబడె స్వరప్రధానం బగుచున్. 7

గీ. తనువులకుజీవకళఁ బోలి కడరఁ జంద్రములకుఁ బ్రభఁ బోలెనా వేదపుంజమునకు

నస్థలిత్తమై వెలుంగుమహాస్వరంబొ ముఖ్యముగ నెన్నఁబడె ఋషిముఖులచేత.

చ. పదపడి వేదవాక్యరన పాఠన జన్యమహారవంబుచే
త దిశలు పిక్కటిల్ల నొకతావును శూన్యముగాక గానసం
పదల నెసంగ నుర్వర యమానుష గౌరవమొప్పఁబూంతతో
స్పదము సత్యలోక విభవంబునుగూడఁ దృణీకరించెడిన్. 9

ఆ. అట్లు కొంతకాల మరిగిన పిమ్మట । మానుతెల్ల నిగమ మండలముల
కర్థమెల్లఁగ జొచ్చి రామ్నాయబలముచే సంస్కరింపఁబడిన స్వాంతములను. 10

శా. ఆరీతి న్మతికొన్ని నాళ్లరుగ విద్యారణ్య మాసింహుఁడా
ధారంబేమియు లేని గీబలముచేత న్నాల్గువేదమ్ములం
దారంగల్గిన పావనార్థముల భాష్యప్రక్రియందీసి యా
ప్రారంభంబు వెలార్చె నల్లరకు నార్యావర్త దేశంబునన్. 11

గీ. అట్టి యా నాల్గువేదంబులందు మొదటి । భాగమంతయుఁగర్మవైభవముఁ దెలుపుఁ,
గడమభాగంబు జ్ఞానమార్గంబుఁజూపు, । నదియె వేదాంతముపనిషత్తనఁగఁ జెల్లు.

గీ. ఆ యుపనిషత్తులెల్ల ననంతములుగ । నుండ ధరియింప వలనుగా నోపవనుచు
సరసి యష్టోత్తరశతంబు నందుఁదీసి । వేఱుపఱచిరి ఋషులుపకారులగుచు 13

ఉ. అందలి జ్ఞానమార్గము సమంజసభంగి హృదంతరాళమం
దందఱకు న్స్ఫుటంబుగ మహాప్రతిభం బొడకట్టఁగోరి యా

నందనుఁడు పరాశరుని నందనుఁడైన తగు వ్యాసమౌని, యు
ప్పొంద విబోధమూని వసుసన్ రచియించెను బ్రహ్మసూత్రముల్. 14
గీ. అవియుసున్ రానురాను గూఢార్థమగుచుఁ । గాలగతిచేత దుర్జ్ఞేయ గతికిరాఁగ
బ్రహ్మసూత్రంబులుపనిషద్భాగములును। మునిజనులకు వితర్క భాజనములయ్యె
ఆ. అంతఁగొంతకాల మగుగంగ నీరీతి । యర్థములను నందియముఁ దొలంచి
చిత్తముల్లసిల్ల శ్రీకృష్ణభగవానుఁ । డర్జునునకు గీత లన వెలార్చె. 16
శా. ఆముష్మంబు పురుషార్థ సాధనములై యత్యంత హృద్యంబులై
ధీమద్వేద్యములై తమోనుదములై దివ్యప్రబోధంబులై
శ్రీమద్భావములై యెసంగఁగ మహర్షిశ్రేష్ఠు లేతత్త్రియ
ప్రాముఖ్యంబున వేత్తృతం బడసి జీవన్ముక్తులై రందఱున్. 17
గీ. ఇట్లుగాఁ గొన్నియబ్దంబు లరుగ నరుగఁ । గాలవేగంబుచే హృత్తజ్ఞానులగుచు
నమ్మహావాఙ్మయార్థంబులందుపట్లు । మానుటనుగూడఁ దోలాయమానులైరి.
ఉ. ఆర్యులు నాటికాలమున నందు మహావ్యసనంబుఁ జూచి, ధీ
వర్యుఁ డహార్యధైర్యుఁ డురు పాండితి సూర్యుఁ డనైన శంకరా
చార్యుఁడు సత్కృపాగరిమఁ జక్క రచించెను దొంటి మాటికిన్

ధుర్యములైన భాష్యములు సుప్రసిద్ధవాదము లంతరింపఁగన్. 19

గీ. అంత మధ్వగురుండు రామానుజుండును। గూడఁ దమతమమతబోధకూటములకుఁ
జెందభాష్యంబులురచించిరంద మొప్ప। ద్వైతమనఁగవిశిష్టాద్వైతమనఁగ.

క. అవిరళ ప్రస్థానత్రయ। మవనిం బ్రఖ్యాతమగుచు నలరారెను వి
త్పవిమల విజ్ఞానముచే। నవగత పరమార్థులగుచు నలరిరి పూర్వుల్. 21

గీ. ఇప్పటికిఁగూడనవి యెమహీతలమునఁ। గొన్నియుద్గ్రంథములతోడ గొమరుమిగిలి
యార్యమత తత్త్వ జిజ్ఞాసులగుబుధులకు। సాధనములగు దివ్యప్రబోధములకు.

ఉ. వారల బుద్ధివైభవము, వారల వాగ్రచనా విశేషముల్,
వారి వివేచనాగరిమ, వారల యుక్తిపటుత్వ సంపదల్,
వారి గభీర భావము, లవారిగఁ దర్చి కనుంగొనంగ, నా
పారస సంభవుండయినఁ జాలఁడెన స్మముబోంట్లు నేర్తురే ? 23

గీ. ఐన నాబుద్ధికొలఁది నుదారములగు। వారి సిద్ధాంతములఁ దేటపఱచునట్టి
గ్రంథములుకొన్నివైశద్యకలనఁబడివి। పడయఁగోటినివిజ్ఞానపటిమఁగొంత. 24

గీ. ఎంచె మధ్వగురుండు జీవేశ్వరులకు। భిన్న భావంబు, జీవేశులెన్న గుణ వి
శిష్టులని వారికద్వైత సిద్ధిఁ జేట। పఱచె రామానుజుఁడు, వీరిభావము లివి 25

ఉ. వీరలు మువ్వురు న్విబుధవీరులు, వేదసమంచితోదరుల్,
సారతరార్థ సంగ్రహణ చాతురిఁగల్గిన వారలయ్యు నా

యీ రచనా విశేషముల నందిరి భేదము పెక్కుతావులం ;
గారణ మీము యేర్పఱుపఁగా నిదమిద్ధ మనంగ రాదుగా. 26

క. స్వమతంబు నిల్ప వారలు । క్రమసరణిం దప్పిరనుచుఁ బ్రిచురించెదమా ?
సుమతులె యయ్యును నిగమార్థముగూఢముఁదెలియలేక తలఁగిరనెదమా ?

గీ. ఒక్క భావంబె నిగమంబు లుగ్గడించెఁ । గాని భావత్రయంబు జక్కఁబడదంద;
మువ్వురును మూడుభావములొప్పందుపఱచిరాత్మభాష్యంబులందువారలఘుమతులు

క. ఆ మతముల మూఁడింటిన్ । నామది భావించి యరసి నానేర్చిన య
ట్లీ మీమాంస నొనర్చితి । ధీమహితులు దీనిఁగాంచి దిద్దుఁడు ప్రీతిన్. 29

గీ. త్రిమతముల నాదు మదికి సంధిల్లినట్టి సందియంబుల నిందు నేఁ బొందుపఱచి
యుంచితిని వాని దగ విమర్శించి మీరు । వ్యక్తపఱుపుఁడు నిజము భావజ్ఞులార!

# సగుణాద్వైతము.

ఉ. శ్రీపరమేశ్వర ప్రతిభ చిన్మయమాట సగమ్యగోచరం
బై పరిపాటి చిక్కదరయన్ ఋషిసత్తము లాదినుండి నే

ధోపనిషత్తులం దరచి యుండిరి చర్విత చర్వణంబుగా;
నాపని నేను చేయుదు, మహాత్ములు వ్యగ్రతఁ జెందఁ బోకుఁడీ! 31

క. కలఁడనియో, లేఁడనియో। తెలియుట కాధార మీక్షితిం గన, మైనం
గలఁడనుకొందము దైవము ; । కలిగిన వన్నియును వాని కళలే యనగా. 32

ఉ. కారణహీనమై పరగు కార్యము కల్గదుగాన సృష్టికిం
గారణ మీశ్వరుండని యనంజను, నాతఁడు లీలకై మదిం
జేరిక భావనా పటిమచేఁ గని పెంచి నశింపఁజేయుఁ, దా
నే రహిఁ జీవజాతముల నిండిఘటించును సృష్టికార్యమున్. 33

ఉ. ఆదియు నంతముం గననియట్టి మలీమస సృష్టిఁజేయ భా
గ్యోదయ మేమి కల్గును! ప్రయోజన మేమి? సదాశయంబు లె
ట్లాదరణంబునందు? నరయం బరమేశుని లీలలన్న నీ
వాదము తెల్లఁబోవు; భగవంతుని శుద్ధపదార్థ మొప్పెడిన్. 34

ఉ. దైవము జీవజాత తనుధారణఁ జేయుటఁ దత్తదంశ సం
భావనఁ జెంది, మానవ శుభప్రద దేహమున న్విలాస లీ
లా వివశ ప్రశస్తిఁగని, రంజిలి లీలముగించు ; జీవికిం
దావలమాను, దైవమును ధర్మపరుండగు, లీలయాటచేన్. 35

గీ. ఆది మధ్యాంత రహిత సర్వాధికారి।పరమ పురుషుఁడు, శక్తిసంపన్నుఁడతఁడు;

తక్కినవియెల్ల వాని చిత్తప్రవృత్తు । లట్టె కనుపించి లీనంబులగు సతంబు.36

ఉ. దేహము పాంచభౌతికము, దివ్యతరాత్మయె భిన్నమన్న సం
దేహముచేత ద్వైతనియతిన్ గణియించిరి, విశ్వరూపుఁడే
దేహము రెంటికిన్నిఁ గడతేఱునుహాత్తర మీసమస్య, వ్యా
మోహము లెల్ల బాసిన విముక్తినిఁ జెందు ససంశయంబుగన్. 37

గీ. ఏక మేవాద్వితీయమహా సీశ్వరకళ । వాని కిరణంబులగును జీవతతి యెల
శ్వాసవలె బహిరంతఃప్రసక్తిఁ దిరుగుచుండు, వ్యక్తిత్వ మేరీతి నుండఁగలదు38

గీ. సగుణమన్నను ద్వైతము తగవు లుడుగు । ద్వైత మానస పరికల్పితమగు సృష్టి
మాయయనవచ్చు, దేవునిమర్మమిదియె; । తానెజీవాత్మలనుటసార్థకముగాదె!

గీ. ఎండమావుల లేనినీ రుండిత్రోఁచు । నటులు, దైవమాయా చిత్రనటన వలన,
లేని జీవులు, సుఖదుఃఖ లీలలందిరి । యంతరించెదరిది యె జన్మాంత మగును.40

గీ. సూర్య కిరణంబులెల్ల విశుద్ధముగను । వేఱువేఱుగఁ బ్రసరించి విశ్రమించు;
జీవు లారీతిఁ బరమాత్మఁ జెందఁగలవు।ఘన పరస్పర సంబంధ కలనమిథ్య. 41

చ. ఉపనిషదర్థముల్ దెలుపనోపినఁ దత్త్వరహస్య మద్దియే;
విపుల మహేశ్వరాంశజులు విశ్రుతజీవులు, వచ్చిపోదు రీ

వపువులఁదాల్చి లీలకయి, ప్రాప్తములౌ సుఖదుఃఖ సంపదల్
నిపుణతఁబొంది పోవుటయె నీతము, తప్పదు జీవకోటికిన్. 42

సీ. దుఃఖముల యందు భీత చిత్తుండుగాక । సుఖములం దనురాగ తుష్టుండు గాక
భయమురాగంబుఁగ్రోధంబుఁ బాసియుండు। నాతఁడేనిశ్చలప్రజ్ఞుఁడనఁగఁజెల్లు. 43

గీ. దైవలీలకు భంగమింతయును లేదు । జీవకోటికి న్యూనత చెందదిందు
బ్రహ్మసత్యము బాహ్య ప్రపంచమెల్ల। మిథ్యయే యగు దైవ సమ్మోహనమున. 44

గీ. ఈశుఁడాత్మానుమోది తానెల్ల గతుల । నంతరంగంబునందు నిరంతరంబుఁ
దనకుఁదానుగరమియించితనియుచుండు। నదియెసృష్టిక్రమంబని యనఁగఁజెల్లు. 45

గీ॥ సకల జీవాత్మలాప్రభు శ్వాసనుండి । వరుస బహిరంతరంబుల వచ్చిపోవు
నదియెసృష్టిస్థితిలయంబులగుచుచుండు । నేకమేవాద్వితీయమండ్రీసరణినె. 46

గీ. జలమె యావిరయై మింటనలమివాన। కురియును; ఘనీభవించుటకరకయగును ;
భగవ దవతారములనేక పంథలయ్యుఁ। జెదర కేకముగానుండుసిద్ధమిదియె. 47

గీ. గగన మేఘటమున నున్న, ఘటము చెడిన। గగనమునఁజేరు శుద్ధ వికాసముగను;
దైవ మారీతి నేయుపాదాన వసతిఁ। గాంచినను నదిచెడ దైవగతియె చెందు. 48

గీ. సర్వమెుం దెలిసిన వాఁడు సర్వసాక్షి। యగుటఁదన కష్టసుఖముల నతఁడె సాకు
జీవులు నిమిత్తమాత్రులై చెలఁగుచుండు। ఇదియె చిద్విలాసంబు జీవేశ్వరునకు.

గీ. ఎవరు కోరిన సృష్టి? మాకేటిపీడ ? । తెచ్చిపెట్టిన విధియె సాధింప నగును

పాప పుణ్యములన్నియు వానివె యగు; జీవుల నిమిత్తమాత్రులఁ జేసె గీత.

గీ. "మున్నె వీరలు నాచేతఁ జొలిసి రిపుడు। తడయకేవు నిమిత్తమాత్రంబవగు"మ
టంచుఁ గృష్ణుండు నరునితోఁ జనియెఁ గాన। జీవులన దైవలీలావిచిత్రనటులు 51

గీ. తా భరింపనేరని కష్టదశలఁగూర్చి। కొసరుచు కర్తయు భోక్తయుఁగనుకనతఁడు
మానసికముగఁ బ్రేరేచ మాను నెడల। భారమంతగ నుండ దెప్పట్టునందు. 52

గీ. యజ్ఞపశువును గర్తయు యాజ్ఞికుండు। దైవమే యాటచేత వధపరిసక్తి
యల్ప బాధాకరంబై యనల్ప లీలఁ। దనరు నెల్లప్పుడును సూత్రధారకుడు 53

గీ. దైవమనుభవించు వేడుక దార్ఢ్య మొందు। గలమూల మూర్తి పములె దేశకాల గతులు
సృష్టివైచిత్ర్యములు వాని లీలలరయ। జీవులాతని శ్వాస లుజ్జీవితములు. 54

గీ. దృశ్యరంగమునటకులు ప్రేక్షకులును। సూత్రధారుఁడు నాచుఁ బూజ్యుఁడు పరాత్మ
నవ రసంబులఁ బ్రకటించి నటన సలిపి। స్వీయ లీలావిలాస సంవేద్యుఁ డగును. 55

గీ. అగ్ని సంపర్కమున భస్మమగు సకలము;। హేతు పావకుతోఁ బనియేమి కలదు?
దైవ సంబంధ మట్టిదే జీవుల యెడ। నాహుతిగ స్వీకరించుఁ బూర్ణాత్ముఁ డగుట.

గీ. కడలిపై నావ చుక్కాని నడపువాని। యభిమతానుసారంబుగ నరుగు నట్లు
సకల జీవులు దైవవిజ్ఞాన సరణి। ననుసరించి తరించెద రనవరతము. 57

క. మన యాకృతి ఛాయాపట । మున హత్తినరీతి దైవమును నీవిశ్వం
బున హత్తి ఫలములందదు । మనమును ఒటకృతిఁగని మాదిరి నుండున్.58
గీ. పంకమునునుండిమలినసంపర్కమంద । నట్టికుమ్మరపుర్వుసామ్యముగఁబ్రభుఁడు
జీవుఁడై విశ్వమునఁబ్రకాశించుఁగాని। కష్టసుఖములఁజిక్కఁడెక్కరణినతఁడు. 59
గీ. ఆకసంబున కేగయు విహంగ మవనిఁ । జేరిగాని విశ్రాంతిని జెందనట్లు
జీవి దివి కేగి సంకల్పసిద్ధిఁ జెందు । భువిని జిక్కదు దైవసంభూతుఁ డగుట. 60
గీ. ఆకసము నుండి వర్షించు నంబురాశి । యూపరిగ మాటి వినువీధి కరుగు రీతి
భువి నవతరించి జీవులద్భుతముగాఁగఁ । దరలిపోదురు దేహపాతమునదివికి 61
గీ. పరమ పురుషుని చతురంగ పాళి సృష్టి । జీవ జాతంబులే వాని సిద్ధబలము
వసుధఁదల్లిలలేజయాపజయములగుఁ । బరమచైతన్యపటిమ చేవరలుచుండు.62
గీ. సచ్చిదానందమూర్తి, వాచామగోచ । రాత్మ లీలావిలాస కార్యాను సారి
దైవ్వతము సహింపఁడేక తత్త్వప్రమోది । స్వీయశక్తిని లీలకై సృష్టి సలుపు 63
చ. ప్రభువులు మాఱువేసముల రాత్రులఁ వీధులఁబోయి సత్ప్రజా
శుభశుభ వర్తనల్ గలయఁజూచునటుల్ భగవంతుఁ డాత్మస
న్నిభమగు సృష్టినెల్లెడమునింగి చరాచరవిశ్వలీలలం
దభిమత సిద్ధినభ్యుదయమందునుగాదె ! స్వకీయశక్తిచేన్. 64
క. వెన్నుని రాసక్రీడా । భ్యున్నతి నొకొక్క యువతి కొకొక్కండౌ

బెన్నఁగ నీతత్త్వము ప్ర । చ్ఛన్నముగాఁ దోఁపకున్న జ్ఞానమయంబై. 65

క. క్రీస్తేవరుఁడును సకల । క్రైస్తవసంఘంబు వధువుగా నెంచుటచే
నిస్తుల విలాస తత్త్వమె । వాస్తవ మగునంచు రూఢపఱచుంగాదే! 66

గీ. కలములో సిరా యున్న నిక్కముగ వ్రాయు । లేకపోయిన వ్రాయదట్లే శరీర
జీవ సమ్మేళనమున వసించుసృష్టి। తనువు నశియింప జీవి కాధార ముడుగు. 67

గీ. సూర్యుఁడుదయింపగిరణములొప్పుగాంచి। యస్తమించునుమార్తాండుడస్తమింప
దైవ సంకల్పమున జీవతతియు నట్లె। వానియంశలు వానివెంబడినె యుండు. 68

గీ. పర పరంజ్యోతిదీపరూపమున వెలయు। నదియె పరమాత్మ జీవాత్మయగును బొంద
భ్రాంతి కావరణాంతర వర్తియైన। నదియుఁ దాత్కాలికము విలాసార్థమగుట 69

గీ. దైవకిరణంబు లాత్మ లేతనువునందు । వసతిఁగాంచిన మగుడి దైవమునె చేరు
ననుటజీవాత్మలెల్ల నిత్యములెయగును। గానివ్యక్తిత్వముండియైక్యమును జెందు. 70

ఉ. చిత్రము! జీవజాతముల చేతన మొక్కటియయ్యు భిన్నమౌ
గాత్ర విచక్షణం బ్రతిభఁగాంచు ననేకములౌ విలాస తా
పత్రయ రీతులం; దనువుఁ బాయ నహంకృతి బాయుఁ; దత్త్వస
త్త్వాత్మ విశుద్ధ సూత్రనిధి, దైవవిలాసము ప్రస్ఫుటంబగున్. 71

గీ. జీవులను తండులంబులుసృష్టియనెడు । రోటఁబడిచూర్ణమైస్వస్వరూపములను
విడిచిస్వస్థానమునకేగిప్రియతముఁడగు।పరమపురుషునియందైక్యపదవిఁగాంచు.

క. జీవాత్మలు పరమాత్మని । భావ ప్రతిబింబ బహుళ భాస్వ చ్ఛాయల్
స్థావర జంగమ వరసృ । ష్ట్యావిర్భావాపహరణ యంత్రములనఁగా. 73

ఉ. కష్టము లెన్నివచ్చినను గాయము నేగద యాక్రమించు నా
నష్టము లెల్ల; జీవియుఁగనంబడు భేదము లందునట్లు పై
దృష్టికిఁ జేతనంబగుట; దివ్య విచిత్రవిలాస మింక వి
స్పష్టముగా దె! చేరిక నెసంగఁను పీడిన మాయమౌఁ గదా! 74

ఉ. ఈశ్వరుఁ డైంద్రజాలికుఁడు ; నీపరిదృశ్య చరాచరాత్మమౌ
విశ్వమె యింద్రజాలము ; వివేకముమాని తదేక రక్తితో
శాశ్వతమంచుఁ బ్రేముడి నెసంగఁటయే కనుకట్టు ; సర్వమున్
నశ్వరమంచు నెంచుచు మనంబుఁదగుల్పమియే ప్రబోధమౌ. 75

గీ. దర్పణమునందుఁబ్రతిబింబితగనునిడుఁడు।దర్పణమువోవఛాయయుఁదరలుగాదె
జీవపరమాత్మ లీగతిఁ జెందు ననుచు । రాణి చిన్నాంబ పలుకు నిరంతరంబు.

గీ. రేడియో సినీమాలలోఁ బాడి యాడఁ। గలముశబ్దస్వరూపసంస్కారములను
నైవ మారీతి జీవ జాతములఁ బ్రతి ఫ । లించిలీలార్థమిల విహారించ లేదె? 77

గీ. బీజమున వృక్షము ఘనీభవించి యుండు।రీతిఁబరమాత్మయం దెల్లసృష్టి కలదు

కాకయుండిన నాటకోత్కర్ష యెటులు।సృష్టి కాపాదనంబగు నీశ్వరేచ్ఛ. 78

గీ. జ్ఞానమను తాళవృంతముఁ బూనివిసర।భూమమను మాయమాయమై తొలగిపోవు
ప్రజ్వలించును జీవాగ్ని పరిస్ఫుటముగ।సచ్చిదానంద మూర్తి నసంశయముగ.

గీ. దర్పణంబునఁ బ్రతిబింబ దర్శనమున।వేఱు పిచ్చుక యను భ్రమఁబోరుఁబిచుక
దైవమేజీవులన్నబోధమును మరచి।నరులుపోరాడెదరుస్వార్థపరతనెపుడు. 80

గీ. చెలఁగి తత్త్వావలోడన సలుపువాని । బుద్ధి నీరంబునంబడి పొరలు తైల
బిందువుపగిది వ్యాప్తసంసునెల్ల । దిశలనిలువదొక్కెడదివ్య తేజముగుట. 81

గీ. కంచుకంబునుదొడిగినఁగాయమునకుఁ । గలుగునుష్ణంబుదైవమీకాయమునను
జేరి యనుభవించును మనచేష్టలెల్లఁ । జిద్విలాసమున విధి నిషేధ మేల? 82

గీ. జలధి బడబానలమ్ము సంజనిత మగును । జలమయంబగు మేఘసంజాత విద్యు
దంతరంబునఁబ్రళయాగ్ని యమరియుండు।నటులుపరమాత్మజీవాత్మ యందునుండు.

ఉ. అంబరవీధి మేఘములయందుఁ దటిల్లత వచ్చిపోవు న
ట్లంబుధి బాడబానల మహంకృతి రేగి శమించునట్లు, జీ
వంబు మహేశ్వరాంశమున వచ్చి నటించి తొలంగు, దీనిభా
వం బఖిలంబు లీలయనువార్తఁ దలంపుము మ్లానసఙ్గగదా। 84

గీ. ఒకఁడుశ్రమపడుచుండనింకొకఁడుచూడ। లేఁడుజీవకొక్క టియగుటఁ గ్లేశమొదవ
హంతకులకునుజంపసాహసములేక । త్రాగినైకమునందుహత్యనొనరింత్రు. 85

మ. కదళీ వృక్షమునందు డుంపయె నిరాఘాట ప్రధానాంశ, మం
దుఁదయంబై ఫలపత్రిపుష్పములచే నొప్పారు వృక్షంబులై
మొదలౌ కందము డింద కే పిలకలంబూరించు నారీతి, దో
హదముంజేయును సృష్టి దైవము తదీయానన్యత్వముం జూపుచున్. 86

ఉ. రూపములేని యంబరము శోభిగ నీలముగాఁగఁదోఁచు న
ట్లీ పరిదృశ్యమాన జగమెల్ల నసత్యమెయయ్యు జీవి కు
ద్దీపనమౌను సత్యముగ; దీని నిజంబు గ్రహించువార లా
రోపిత మాయపీడ నిజరూపముఁ గాంచి తరింతు రెంతయున్. 87

చ. వలఁబడుపక్షి తంతువుల బంధముఁ ద్రెంచిన ముక్తపూనటుల్
బలిమిని దేహపంజరములం బడు జీవులు మోహపాశ శృం
ఖలములఁ ద్రెంచి, నిర్గమన కాల నిరీక్షణ చేయునొప్పు నీ
కలుషములు లేములుం దను వికారము లాత్మల కంట వెన్నఁడున్. 88

చ. కడలిఁ దరంగ సంచయము గల్గినఁ గల్గకయున్న నీటిలోఁ
బొడమదు భేదమేమియుఁ, బ్రభుండగు దైవమునందె సృష్టిసం
దడిఁబడి భిన్నరూపములఁ దాల్చినఁ దాల్చకయున్న దైవమే ;

వశి పవనుండు వీచినను బర్వక నిల్చిన వాయువే యగున్. 89

చ. కలదొకతత్త్వ మద్ది చిరకాలము నేపనిపాట లబ్బకే
మెలఁగెను సృష్టికార్యమున మించిన వేడుక శక్తిపూర్ణుఁడై
చెలఁగును ; మంచిచెడ్డలను జేసెడువాఁడౌ తలంపనోపు, జీ
వుల మొర నాలకింపఁడు ప్రభుండు విలాసమె ముఖ్యకార్యమౌ. 90

గీ. ధవళ వర్ణంబునుండి ప్రాప్తంబులయ్యె । నెల్లవర్ణంబు లారీతి నీశునుండి
భువిఁ జరాచరసృష్టిసంభూతమయ్యె।నిటఫలాఫలంబులువాని యాశ్రితములు.91

గీ. ఆత్మ శుద్ధము,దానిపై నావరించు । బాల్యచాపల్యమనుమాయఁ బాపునెడలఁ
బూర్వగతివిరాజిల్లుసంపూర్ణముగను।మనదిప్రాప్తవస్తుప్రాప్తియనఁగఁజెల్లు.92

గీ. మది వివేక వికాస సంపదలఁ బొదల। నాపదలఁ దేలును,నలాబు వంబురాశి
మున్ననట్టులు,శశియుఁగౌముదినిజమ్ము।గతినిబరమాత్మజీవాత్మఁబ్రతిఫలించు.93

గీ. చంద్రునకును శరన్నభశ్చారమట్టులు। సాధన చతుష్టయాచార సంపదలును
బ్రహ్మవిద్యాసదభ్యాసవాంఛితునకు।సుగమములగుచునద్వైతశోభఁగూర్చు.94

చ. నరుఁడు సరోవరంబన మనంబు జలంబగు, నిశ్చలంబుగాఁ
బరగిన దర్పణంబుగతి వర్ధిలు, నర్మితత ప్రవృత్తులున్

దొరలిన భంగములొ్వడసి దుఃఖతరోర్ముల జిమ్మ దారుణా
సుర పరివర్తనస్సలుపుచు న్మలినత్వముఁ గూర్చు జీవికిన్. 95

గీ. సకల సచ్ఛాస్త్ర సజ్జన సంగమమునఁ। బురుష యత్నంబుఁగావించు నరవరుఁడు
స్వస్వరూప విజ్ఞాన సంపత్తి గలిగి । నపునరావృత్తి సచ్చిదానందుఁడగును.96

గీ. హేమ మొక్కటియయ్యు నహీనశక్తి।కటక కేయూర కుండ లాంగద విభేద
ములఁబరిణమించుఃచైతన్యముగనొకటి।వివిధముగఁదోఁచుదేహములేవఁఅగుటను.

గీ. యోగమునఁగల్గు శమ మపరియోజన మగుఁ।దిరిగివచ్చునుసంసారతిమిర మెల్ల
జ్ఞాన దీపంబు వెలుఁగ నజ్ఞాన తిమిర।మంతరించును, శుద్ధ పదార్థ మబ్బు.98

గీ. ఆతపంబున నిలిచిన యట్టివాఁడు । నీడయందుండు సౌఖ్యము జూడఁగను నె?
ద్వైతభావన కలుగ నద్వైత సిద్ధి।కలుగ నేరదు జీవికజ్ఞానవశత. 99

గీ. ఆకసంబున వాయువు నందుఁబుష్ప।సౌరభంబును మిళితమై పాటుకీతిఁ
బ్రకృతి పురుషులుమిధ్యాప్రపంచకల్ప।నమున సకలలీలావిలాసములఁగండ్రు.

గీ. ఉదధినుండి తరంగము లుప్పతిల్లి । యార్చి పోరాడి తుద కేకమగు పగిదిని
జీవపరమాత్మలటమటఁజెందియైక్య।మగును; జిద్విలాసంబు మాయా ప్రవృత్తి.

గీ. చిత్కళలు జీవులగుట ప్రక్షిప్తముగను । వారి కోర్కులు ఫలియించితీరునవని
దైవసంకల్పములు నిరాతంకములగు।వాని లంకెలు తెలియంగ వశముగాదు.

ఉ. తలఁపఁగ వృక్ష మొక్కటి యథార్థమునన్, ఫలపత్రపుష్పముల్

గలుగును దాన, నాత్మయుతంబులం గలదొక్కటియయ్యు విశ్వమున్
వెలయఁగఁజేయు జీవ సముపేతముగాఁగ ననంత రూపముల్
చెలఁగ సృజించి పెంచుచు నశింపఁగఁజేయు స్వకీయ శక్తిచేన్. 103

గీ. దీపమునుండి యెన్నెన్ని దీపములను। వెలుఁగఁజేసిననన్నియు వెలుఁగుఁదుల్య
దీప్తి, నట్టులె పరమాత్మ తేజమునను। వెడలుజీవాత్మలెన్నైనఁబృథ్విఁదివిని 104

ఉ. దీపమునుండి వెల్గునవ దీపములన్నియు నేకరీతి స
ద్దీపనఁజెందుఁ గాంతియుత తేజములన్ సమరీతినుండు న
ట్టీపృథివిం బరాత్మఁగను నెల్ల విశుద్ధ సజాతి జీవముల్
కేవల మేకరీతిగను, లేశము భేదము గల్గదెంచినన్. 105

చ. జలము రసాత్మికంబయి ప్రశస్త లతాద్రుమ పల్లవావలం
గల ప్రతిబింబరూపములఁ గన్పడఁజేయుగతిం బరాత్మ ని
ర్మలగతి సృష్టినంతను ధరన్ దివి జీవ జలాశయంబునన్
వెలయఁగఁజేయుఁ బెంచుఁ దుది విశ్వమునెల్లను ముంచివేసెడిన్. 106

గీ. అరయ నాబ్రహ్మ కీట పర్యంత జీవ। మొకటియైనను వ్యావహారికముగాఁగ
బ్రహ్మముఘనంబునీచముర్వరను బరుగు। జ్ఞానమునఁబోవు వ్యవహారసరణియెల్ల.

గీ. జ్ఞానవంతునికే మిథ్యయగును జగము। లేని వానికి సత్యమే యగుచునుండు;
సత్య మందఱికెల్లెడ నిత్యమగును। అగ్నిసంపర్క మెల్లర నంటఁగాల్చు. 108

గీ. పెద్ద భవనము కడుఁజిన్న యద్దమునను। నిండి ప్రతిబింబితంబగు క్రమముగాఁగ
సృష్టి సూక్ష్మాత్మయందు సంక్షిప్తతఁగను। పూర్తిభాసితంబై నఁదోఁచుచున్న.

గీ. తానువాంఛింపక యెశుద్ధదర్పణంబు। ధరణిఁ బ్రతిబింబమును గూర్చు సరణి బ్రహ్మ
సృష్టికార్యంబు నిష్కామ్య సిద్ధిఁ జేయు। జ్ఞానులును లోకసేవనసలుపుచుంద్రు.

క. గురుమీఱుచు శిష్యుండగు। బరిజనుఁ డధికారి మీఱి, వర్తిలఁడు మహిన్
గురుఁబోలుచు శిష్యుండగు। బరిజనుఁ డధికారిఁబోలి వర్తిలఁజాలున్. 111

మ. మన దేహంబునఁ గల్గు యంత్రముల మర్మంబుల్ గనంజాల, మీ
శుని మర్మంబులు గోచరంబగునె? శిష్యుండున్ గురున్మించునే ?
జనకుం డీశుఁడు వాని చిత్తమె విశేషంబౌను మర్త్యాళికిన్
తనుతాపంబులు వానివే యను దృఢాత్మన్ నమ్మి శాంతింపుమీ ! 112

క. మీతండ్రి యాత్మ మీలో। నాతతగతి నుండి మాటలాడించుంగా
కే తెఱఁగున నొకవాక్యము। వాత న్వెడలించునట్టి వారలె మీరల్. 113

గీ. అర్జునా! సర్వభూతాంతరంగ రంగ। మందు నివసించి యున్నట్టి యాత్మ నేను,
భూతములకాదిమధ్యాంతములును నేను। సన్నుమించిన వస్తువింతయును లేదు. 114

గీ. ఘటము మృణ్మయమైన ఘటమె యగును। మృత్తికయనగు చితికినమృత్తికగును

ద్వైతమారీతి జీవిమై తనరు నపుడు । జీవి యుండురు, ద్వైతసిద్ధి యుడుగు 115

గీ. పట్టుపురుగుచే నిర్మింపఁబడిన గూటఁ । బట్టుపడునద్ది యటు పరబ్రహ్మతాను
సృష్టిఁజేసిన మాయచేఁ జిక్కుపడియె,। జీవుఁడై దాని భేదింపఁ జేయునంట. 116

గీ. పుష్పఫల లతాపత్రవిస్ఫూర్తివిటప । మూలశాఖాదులునుబీజమున వెలయును;
వివిధ నామరూపంబులవిశ్వమెల్లఁ । బరమపురుషునియందె సంభవములగును.

ఉ. భారత యుద్ధరంగమునఁ బార్థుఁడు బంధువధన్ సహింప కే
బీరముతగ్గి నిల్వ యదువీరుఁడు తత్త్వము బోధచేసి త
త్సారము పారమార్థికము చచ్చినఁజంపినఁ దప్పులేదనెన్
భారము సర్వమీశ్వరునిపై నిడి చంపుము చంపు మీవనెన్. 118

గీ. పక్వములుగాని మృణ్మయ పాత్రలెల్ల । జలమునం దేకమైపోవు చందమునను
నీప్రపంచము,జీవులు,దృశ్యమెల్లఁ।దుదకుబ్రహ్మైక్యపదముఁ జెందుదురుసతము.

ఉ. హేమము కద్దుకావున మహిం గటకాదుల భిన్నసృష్టి యీ
భూమిని జేయవీలుపడెఁ బూజ్యుఁడు చేతనరూపుఁడై పరం
ధాముఁడు నిత్యుఁడౌట నిరతంబును సృష్టి యొనర్పఁగాఁ దగెం
బామర పండితాదుల కుపాధి పరాత్పరుఁడే యగుంగదా! 120

గీ. చేతనము దేహపంజరస్థితిని విడువ । జన్మవాసనతో నిజస్థానమునకుఁ
జేరు పరమాత్మయగుటఁ బ్రత్యక్షప్రతీతి । సంబుజము వీడి షట్పద మరుగునట్లు.
గీ. పుష్పములు వృక్షములయందుఁ బొడమి పోవు । నట్లు జీవులు పరమాత్మునందు బుట్టి
పెరిగి నశియించు లీలా ప్రవృత్తి కొఱకు । జలములం దరంగావర్తముల విధంబు.
చ. జలనిధి భానుమంతుఁడు వెసం బ్రతిబింబితుఁడయ్యు వేఱ్క ని
ర్మలుఁడుగ నుండు, బింబము క్షమం గెరటంబుల సంచలంబునం
గలతను జెందు, దైవమునఁ గర్మము లంటవు, జీవునంటు చం
చలతర మానసంబున భృశంబుగ నావృతుఁ డౌటచే ధరన్. 123
గీ. చిద్విలాసమునఁ బుట్టుచిత్రరూపముగల బ్రహ్మాండవృక్షము మోఘముగను
దైవ మానస రంజక దర్శనంబు । మించువలెఁ గానుపించి శమించుచుండు. 124
గీ. అగ్నిసంకర్షమున హేమ మగ్నిరూపమును ధరించెడిరీతి సన్ముని సమాధి
మదిని దృఢ నిశ్చయముతోడ మననఁ జేసి । దానిరూపంబునందు విజ్ఞానశక్తిను.
గీ. నేనె కరమాత్మననుదృఢ నిశ్చయమున । నలయుఁగు గీటకము భ్రమరాకృతిఁగ నేఁ;
బట్టుపురుగను తెక్కలఁబడసి తుదకు । స్వీయనిర్మితావరణంబుఁ జించి యెగురు. 126
గీ. తన జలంబున జగతి నంతటను నింపుఁ । గడలి యన్యనదీ జలగ్రహణమందు
జ్ఞాని యెప్పుడు లోకవిజ్ఞానమునకు । వేచియుండుఁ బరబ్రహ్మవిదుఁ డయ్యు. 127
ఉ. ఆదము విగ్రహంబును స్వయంబుగ మృత్తికతోడఁ జేసి భా

గోర్యదయ మహానటుల్ భగవ దూర్జిత వాయువునిఁ జేతసం
బై దయివార్తే; దైవమొ రయంబున లీలకుఁ బెక్కురూపముల్
తా ధరియించె, ద్వైతమొటు దార్కొను మించిన యీశ్వ రేచ్ఛకున్? 128

చ. కలిగిన జన్మమందుఁ గల కష్టసుఖంబులు, పుణ్యపాప స
త్ఫలములు దేహపాతమునఁ దత్త్వముతో విరమించు సర్వముం;
గలుములు లేములుం దను వికాసము లాత్మలు నిర్వికల్పముల్;
పొలమున సస్యముల్ వోడమి పోవును జీడలు భూమికంటునే? 129

గీ. ముందుఁగలుగఁబోవుతరంగములుసముద్ర। మందుఁగలిగినరీతిబ్రహ్మమున భూత
వర్తమానభవిష్యత్ప్రపంచములును। బీజభూతంబులై యుండుసాజముగను. 130

గీ. గగన మంబుదాధారమై క్రాలుచుండి। మేఘమునుస్పృశింపనీతి మించుసృష్టి
యంతటనునిల్చియుండిబ్రహ్మమును దానిౕ నంటక యుండు నెంతయునరసిచూడ.

ఉ. తైలముఁబీల్చి వత్తి సతతంబును జ్యోతికి నందఁ జేయు న
ట్లోలి జగద్విశేషముల నోర్పున జీవిగ్రహించి యీశ్వరో
ల్లీల సమర్పణం బొనఁగుఁ గ్లేశము నెంచక, యంత దైవమే
పాలనసేయు జీవుల నపార మనుగ్రహంబున ముక్తి నిచ్చుచున్. 132

చ. కదలి తరంగ ఫేనములఁ గాంచుచు ధూళి రజంబు లేకయే
వడువునుండు నట్లుగను బ్రహ్మ జగంబున నిండియుండి సం
దడి ననఘుండు నిర్మలుఁడు దాతయునై వెలుఁగొందుచుండు కై
వడి భువి జీవులుం బరమ పావనుఁ గాంచఁ దరింప నోపెడిన్. 133

గీ. క్షీరమందున ఘృతము వసించునట్లు। మృత్తికను ఘటమును వసియించునట్లు
ఆత్మలో నిండినయవి బ్రహ్మాండములవి। గన నధిష్ఠానమునకంటెఁ గావు వేఱు.

గీ. గంధ పుష్పముల్, దీప ప్రకాశములును। వేఱు కానట్లు సృష్టియు విశ్వకర్త
వేఱు కానేర దెన్నఁడు విబుధులకును। మూఢులే యట్లు విడఁదీసి మున్గుచుండ్రు.

గీ. వసుమునం గుసుమ ఫల ప్రవర్ధనంబు। గగనమందున నక్షత్ర గణము వలెను
సృష్టియంతయుఁ బరమేశు నిచ్ఛయందు। గలిగి పోవుచునుండు సక్రమముగాఁగ.

ఉ. భవనము లోనియాకసము స్వచ్ఛమైన గవాక్ష దర్పణా
భ వశత రక్తవర్ణమును భావము దోఁపఁగఁ జేయు నట్టులే
భవభయ శూన్యమై పరగు బ్రహ్మము సృష్టికి హేతువౌటచే
భవమున జీవమై ప్రకృతి బంధమునం బడి ఖేదమందెడున్. 137

గీ. అరణియందుండియుత్పన్నమగునువహ్ని। పృథ్విపరమాత్మనుండియావిర్భవించు
చుండు, జీవాత్మలన్నియు నొక్కరీతి। జన్యజనక విభేదమసత్యమగును. 138

గీ. ఆతపాదుల దీప్తిచే నంబురాశి। తప్తకాంచన దీప్తులఁ దనరు నట్లు

లింద్రియ ప్రకాశమున జీవేశ్వరులకు।సృష్టి వైచిత్ర్యమెల్ల విస్తీర్ణమగును 139
గీ. జలమునందలి భాస్కరచంద్రబింబ । సమతివలెఁదోఁచుసృష్టి ప్రసరణముఁ గని
తత్త్వవిజ్ఞానిభ్రమఁ జెందఁదగదుగాదె!।మిథ్యయగునట్టిదృశ్యముతథ్యముగను.140
గీ. పరిమళముపుష్పమునువీడి వ్యాప్తినొందు।నటులుజ్ఞానులుస్వార్థమునవలఁద్రోసి
లోకసంరక్షణార్థ మీ లోకమునను । సంచరించెదరమలసంస్కారపరత. 141
గీ. వత్సరమునందు గడియలవలె సతంబు । రక్తిబ్రహ్మాండములుసహస్రాకములుగ
వెలసినశియించునని బుధుల్పలికిరహహా!।చిద్విలాసము నంసువిశేషమిది మె.142
గీ. అంకురమునందు బల్లవమమరునటులు। మృత్తికనెటుఘటాకారమునమునటులు
కాలగతిగల్గుబ్రహ్మాండపాళులెల్ల,।బ్రహ్మమునలీనమగుచుఁబ్రభాసములగు.143
ఉ. గేహము కూలిపోవునని గేస్తు గ్రహించి తొలంగునట్టు లీ
దేహము నిల్వనేరదని తెంపున దేహియు వీడిపోయెడిన్,
దేహియు గేహియున్ శివని దీధితియాటచు దేహగేహముల్
దాహమునంద నీశ్వరుని ధామముఁ జేరు నసంశయంబుగన్. 144
గీ. సూర్యభగవానుఁడే జగచ్ఛోభ కెల్లఁ।గారణంబయ్యుఁ గానట్లు కానుపించు
నటులుపరమాత్మయీసృష్టినటనయందు।సర్వమును దానెయయ్యునిస్సంగుఁడగును

గీ. ఆత్మ మన దేహముచం బ్రీతి యణువునందు। వ్యాప్తమైయుండె, నాత్మయ యంబు సృష్టి
జీవచైతన్యమాత్మ, లీలావిలాస । నటనమిది దైవచిత్ర పర్యటన మహహ !
ఉ. ఈశ్వరుఁ డీజగంబు సృజియించి చరించుచుఁ జేతనాకృతిక్
విశ్వవిచిత్ర నాటక మభీప్సిత సిద్ధికి నాడుచుండుటన్
శాశ్వత భూమికల్ నిలువఁజాలవు, మా తెఱు వేషభాషలన్
నశ్వరమంచు నెంచి యదనందగు నృత్యముఁ జేసి పోవలెన్. 147
గీ. తెరను దెరచినఁ బాత్రలు తిరిగియాడు। మాయనంతయు నేకమై మాయమగును
గాన క్షణభంగురము నాటకము నిజంబ। టంచుఁ భ్రమఁ జెందుట జ్ఞానమగును గాదె
గీ. ధరణి సుఖదుఃఖముల నిరంతరము మున్గి। హర్ష శోకంబులందు కనార్తి శముఁ
దత్త్వసార విజ్ఞానామృతంబునందు। వగలు వాఁడు జీవన్ముక్తుఁ డరయ ధాత్రి. 149
గీ. నివురు గప్పియున్నట్టి యగ్నియగు జీవి । చల్లఁగా నూదియూజ్యంబుఁ జల్లు నెడలఁ
బ్రజ్వలించును వరపరబ్రహ్మమగుటఁ। దత్త్వజిజ్ఞాసయూజ్యమైతనరు నిచట. 150
గీ. కడలి యంతయు నుదకమా, గాని ఫేన । ఘనతరంగాదు లెవ్వియుఁ గాని రీతి
సకల వేధోండముల నాత్మ ప్రకటితమగుఁ। దదితరంబేదియును లేకవిదితముగను.
గీ. కటక కేయూర కుండ లాంగదము లెల్ల ! వరసువర్ణము; వేఱుగా దరయ నట్టె
సృష్టి యంతయు జడమును, జీవతతియు । బరమపురుషుని చిద్విలాసరసమగును. 152
చ. మలినముగాని యద్దము తమ స్వనబింబముఁ జూపు, నద్ది సి

ర్మలముగ నాటలాడు మనమాదిరి, మానిన మాను, సద్దముం
దొలఁగిన బింబముం దొలఁగు, నూల్కొను సృష్టియునట్లె దైవలీ
లల వెలుఁగొంది నాటకవిలాసము లాస్యముసల్పి పోయెడిన్. 153

గీ. వామ హస్తంబునంగల ప్రబల ధనము । దక్షిణ కరంబు గైకొనఁ దప్పదేమి!
దేహములుభిన్నములెయైనదేహియొకఁడె।యగుటసర్వస్వములుఃజగదనుభవములు.

గీ. పుష్ప గంధాదులనుగూడి పొరలుగాలి । వాని నంటనికీతి జీవంబు దేహ
మునవసించుచుఁదగ్గుణములనుబొందదని।యెఱుంగుముపరమాత్మయగుటవలన.

గీ. అనల జలములు ధరఁజేరి యనిలహతిని । వింటి కంబుదాకృతిఁజేరమిన్ను దాని
కంటకయెయుండు,నటులు పరాత్మలీల। నైజగంబునమున్గియునంటదఘము. 156

గీ. తత్త్వవిజ్ఞానితో మైత్రిఁదగులు నెడల।శుద్ధ జలసేచనము దేహ శుద్ధిఁజేయు
నటులు సంసార పంకంబు నపనయించి।ముక్తి సాధనోపాయప్రసక్తిఁగూర్చు.

ఆ. సూర్యుఁడొక్కఁడయ్యు, జొచ్చు లోకంబుల।నట్టు లాత్మయొకటియయ్యుసకల
జీవరాసులందుఁ జెలఁగి వసించును। లీల కదియె తగిన రీతిగాన. 158

గీ. సాలె పురుగును బోలె నీశ్వరుఁడు సృష్టి।యనెడు దారంబుఁ ల్లియనంతరమున
దాని నుపసంహరించు స్వార్థంబుదీర।స్రష్ట మనకిట్టి సంసృతి సంతరించె. 159

గీ. భిన్నభాండ జలంబుల భిన్నగతులఁ। బ్రతిఫలించిన సూర్యున కతుకవంపుఁ
గలుగు భేదముల్; భాండవిఘాతముననె । యంతరించును జీవాత్మ యట్లె యగును.

గీ. ప్రాణుల శరీరములు పాంచభౌతికములు। పరమచైతన్య మొక్కటి ప్రబలునందు
భేదమేరీతి వీనిలోఁ బొడకట్టును। చిత్రనటనలు లీలావిశేష గతులు. 161

గీ. సకలజీవులుఁ దమయున్కి సత్యమని యె। తలఁచుచుందురు లేమని తలఁపరెవ్వ
డాత్మయే బ్రహ్మ మద్వితీయము మనఁబడు। సద్వియాద్యంతరహితసర్వాధికారి.

ఉ. అంబరవీథి గాలిపట మద్భుతరీతి నటించుచుండు నా
డంబరవృత్తి సూత్రము గడంక సరుండు వహింప, నట్టి యా
లంబన వీడ నూడు నటులన్, భగవంతుఁడు త్రిప్పునంత కా
లంబుఁ జరించి జీవి యవల న్విరమించుట ధర్మమౌఁగదా ! 163

గీ. ఉదయమునమృణ్మయంబుగనున్న దిపుడు। ఘటశరావాదులుగ మారిపగిలె గాన
గుమ్మరియుమృత్తికయుభిన్నమిమ్మహినని। ద్వైతభావముప్రతిభాసితమగుఁగాదె!

గీ. తత్త్వమసియనువాక్య సందర్భమునను । జీవి పరమాత్మ యను కార్యసిద్ధిగలిగె
శ్రవణ మనననిదిధ్యాస జన్యములగు । చిత్తశుద్ధులవడయుటచే లభించు. 165

గీ. మరణమేయంతమైన జన్మమునఁగలుగు । ననుభవములెల్ల వ్యర్థంబులగును జీవి
దైవమున లీనమైన సార్థకతఁ బొందు । సకల జీవానుభవములీశ్వరునివగును. 166

చ. అణుమయుఁడై మహేశుఁడనయంబు నభస్థలి నిండి, సృష్టికా

రణమున దేహధారణ పరంపరఁ జేయుచుఁ దృప్తిఁగాంచు స
ద్గుణ నిధియైన సర్వగుణ దూరునిగా గణియింత్రు కొందఱీ
గణనముః యుక్తమౌనె నిజకార్యధురంధరుఁడైన వానికిన్. 167

గీ. ముకురరూప చిదాకాశమునను సృష్టి। ప్రతిఫలించిన వ్యక్తిత్వ భావమేల?
యీశుఁడేసృష్టికార్యంబులెల్లఁజొచ్చి।తానెవిహరించుచుండె యథార్థమునకు.

గీ. సకల దృగ్దృష్టదృశ్యత్వ సంభవములు।బహుచరాచర దేహ జీవములఁగూర్చి
విశ్వనటనంబు సలుపు ప్రవీణునకును।బాపపుణ్య విచక్షణా ప్రభ యదేల? 169

గీ. గంతలంగట్టి యుంచిన కనుల వలెను। బంజరంబున నుంచిన పక్షి వలెను
సృష్టిసంకల్పములఁజిక్కు-జీవిస్వీయ।శక్తిఁగోల్పోయియైహికాసక్తిఁగుంగు.170

గీ పుష్పమునసౌరభంబునుపువ్వులనునూనె। రుధిరసంబున వ్యాప్తమైత్రుళ్లుటలు
సకల దేహంబులం దాత్మ సంచరించి। చిత్రనటనంబు సేయు ధరిత్రిఁబ్రీతి. 171

గీ. అంబరంబున మేఘముల్ హయ గజ రథ।పర్వతములట్లు గాన్పించుభంగిసృష్టి
ధరఁ జరాచరరూపముల్ దాల్చిచిత్ర। నటనఁగావింతు వాత్మీయపటిమ దేవ! 172

గీ, ప్రాప్తకార్యములం దనురక్తిఁ గనక।యనుభవించుచు నుండెద రాత్మవిదులు
ముకురమునఁబడఁచా మనుబొందుఁగానిర కియువిర కిగాం చదు బొంతిఁగనగ

క. జీవన్ముక్తుల హృదయము। తోవలముగఁ దంచఁబడిన ధాన్యమువలె నీ
ర్జీవంబై జన్మరహిత పావనతన్ దైవభక్తి పరమై వెలుఁగున్. 174

చ. జననమునందు జీవములు స్వార్జితమైతగు జ్ఞానమెల్ల వెం
టనె కొనిపోయి మృత్యువున నర్మిలి నాపరమాత్మఁ జేర్చు; నం
దునఁ బరమేశు వైభవము ధూర్వహమైతగు, జీవకోటి యా
త్మను సమరీతిఁ గూడుచు ముదంబును గాంచును సర్వకాలమున్. 175

ఉ. జీవముగల్గు దేహము నశింపక సక్రమ వృద్ధిఁ జెందెడున్
జీవముపోవ దేహము నశించును నిల్వదు కొద్దికాలమున్
దైవ విలాసమందు విశదంబగుఁగాదె! విమర్శఁ జేసినన్
స్థావర మీశ్వరాంశము మృతంబగు భౌతిక దేహ తత్త్వమున్. 176

గీ. అంధకారము ప్రస్ఫుట మగుచు నుండ। దీప కళికను వెలిఁగింపఁ దీరునట్లు
లాత్మసాక్షాత్కరింపదుఃఖార్తులెల్లఁ। దొలఁగిపోవును క్షణములో విలయమంది

ఉ. ఆదిరియున్ జలాగ్నిమయమౌచు ననేక విశుద్ధ యంత్రముల్
జీవమొయిం జలించునటు జేసి ఫలంబులఁ గూర్చు నట్టిలన్
దైవమొకం డనేకభువనంబుల సృష్టియొనర్చి పెంచి, యా
హా! విలయంబొనర్చుఁ దెలియందరమౌనె? తదీయ వైఖరుల్. 178

గీ. వసుధ నజ్ఞాన మానంద వైజయంతి। శాంతి, జ్ఞానము; దైవము శాంతివిడిచి

సృష్టిలోఁబడి జీవుల కష్టదశల। ముందు తెల్పుచునుండెఁ బ్రాముఖ్యముగను. 179

ఉ. ఎండిన నేలఁద్రవ్వ, జలమెంతయు లోఁతునఁ జిక్కునట్లు బ్ర
హ్మాండము పైకిఁజూడఁ బ్రళయంబుగఁ దోఁచుఁ దితీక్ష పెంపునన్
దండిగఁ దత్త్వసారమును ద్రచ్చిన జీవజలంబు చిక్కు, నా
ఖండల వైభవంబు తులగాదుగదా ! పరమార్థ సిద్ధికిన్. 180

గీ. చిద్విలాసమె కావచ్చు సృష్టి, జీవు। లనుభవించెడి శ్రమలు భయంకరములు
దైవమునకెట్లు లాహ్లాదదాయకములో?। జన్మమాద్యంతదుఃఖభాజనముగాదె.

మ. స్వవిలాసార్థము చిత్తమందు భగవత్సంకల్ప సంజాతముల్
భువనంబుల్ హృదయప్రవృత్తులగు, భావింపంగ నస్తిత్వమిం
దువసింపం గలదెట్లు ? మిథ్యయెయగున్, దుఃఖార్తులు న్మిథ్య వి
కృతి వినోద ప్రతిభాసితంబులవి చేరంజాల వా యీశ్వరున్. 182

ఉ. భావనయందుఁబుట్టి పరివర్తనఁజెందెడి సృష్టి, స్వప్నసం
భావనఁబోలె మిథ్యయగుఁ, బ్రాప్తములౌ సుఖదుఃఖ సంపదల్
జీవులకుం బరేశునకుఁ జెందవు, లీలకుఁగల్గు భ్రాంతులౌ
దైవిక చిత్త సంజనిత దర్శన మాత్రములీ జగంబులున్. 183

గీ. ఊహయేగాని క్రియలోన నది కీలేని । సృష్టి పరమేశు లీలావిచిత్రి దృశ్య,
మందుజీవులఁగష్టసుఖానుభవము। లలమునటువోఁచుటయునొకయాకమగును.

గీ దైవ విజ్ఞాన మాత్మను దగుల నట్టి । మానవుప కింకిన మడువు మధ్యనున్న
జలచరంబులు పపుపోట్లు సంభవించి।జీవితాంతము దనుకఁ గృశించి పోవు.

చ కన నశరీరి యాత్మయగుఁ గావున భౌతిక వర్గకల్పనం
బొసరిచి, చిత్రిచిత్రి సమయోచిత కాయములన్ సృజించి, యా
తనువులఁ దాని చొచ్చి, సతతంబు విలాస విశేష లీలలం
దనియుచుఁ బోవుచుండు, సతతంబును నిర్గమహేంద్రజాలమా. 186

గీ దృశ్యమంతయు నీశ్వర ప్రీతి కొఱకుఁ । గల్పితంబౌట నావేడుకను ముగింప
నశ్యమగుచుండు నీసృష్టినాటకంబు।దృశ్యమగు చేతనంబె తరించు నింక. 187

గీ. తండులంబులఁ గొబ్బరివండు కుళ్ళు,।జలము గలిసిన తేనె రుచ్యంబు గాదు,
శ్రవణమననంబులనుగ్రహించు మదిఁగు,।పరపరబ్రహ్మమాత్మలో పలనె వెలయు

క. నరునకు సంతతి గలుగుటఁ । దరుగం డభివృద్ధిఁ జెందఁ దరతరములు న
త్తెఱఁగున దైవము జగములనెరిపియు క్షీణింపకుండు నిరతిశయుండై. 189

గీ. కల్పవృక్షంబు దైవసంకల్ప మందు।జగములను పత్రఫలపుష్ప సమితి పొడమి
జీవి కను భూత మొనరించి శిథిలమగును;।సహజ మదిగాన వాపోవఁ జనదొకింత.

గీ, తెగదు, కాలదు, తరుగదు, వగులదెపుడు,।దేశకాల భేద విపరిస్థితులఁ గనదు,

ప్రాప్తమై నేత్రైదేడలఁబరివ్యాప్తమగుచు;। అనిలమే జీవపరమాత్మలగుచుఁ ధ్రువము.

గీ. తనువు లుచ్ఛ్వాస నిశ్శ్వాస లనవరతము। స్వప్నజాగ్రత్సుషుప్తుల జరుపుచుంట
బ్రతుకు; నూపిరినిలిచినవచ్చు మృతియు;। వాయువే పరమాత్మ యై పరలుఁగాదె! 192

గీ. సూర్యుఁడుదయింపజగమెల్ల శోభఁ జెందు। నినుఁడు గ్రుంకినఁగాంతియు నేగునటులు
నాత్మదేహము వీడట నాక్రమింపఁ। జెలఁగు నదిపోవ విశ్రాంతిఁ జెందుఁగాదె! 193

మ. ప్రతికాయంబుననంతరాత్మ నిజమార్గంబుం బ్రబోధించుఁ; ద
ద్గతి నిర్లక్ష్యము చేసి భౌతిక మనః కాంక్షల్ విజృంభించుటం
బతితంబై తనువంతరించుఁ గడగడ్డంజెంది శిక్షాస్మృతిం;
గృతకృత్యంబగు నాత్మ భౌతిక విముక్తిం జిత్ప్రకాశంబిదే! 194

గీ. మనమనస్సాక్షియై వసుంబాధ చుగుటఁ। దత్ప్రబోధంబు ఋజుమార్గదర్శియగుచు.
జెప్పుతప్పొప్పులనుగడునొప్పిదముగ। నంతరాత్మయె ఘనపరమాత్మ ధ్రువము 195

చ. తలఁపఁగ నీశ్వరుండు స్వతంత్రుఁడు, శక్తిసమన్వితుండు, ధీ
విలసితుఁడుం, బ్రపూర్ణుఁడుఁ, బ్రవీణుఁడుఁ బాపపరీత సృష్టి, నిం
దులకయి చేయుఁ? గారణము దోఁపదు, జీవులహింస సేయునే?

క. ద్వైతక విశిష్టాద్వైతము । లై తనరిన సృష్టికర్త కది లోపమ్; ద్వ
ద్వైతము సగుణం బైనను। తన్మాత్రల జీవాత్మ హింస చయ్యన నుసుగున్. 197

ఉ. దాగుడుమూతలాడుతటి, దర్పకు కేళులయందు, హాస్యభా
షాగరిమన్, మనోహర వశంవద లీలల యందు, సత్యధ
ర్మాగమ సాంప్రదాయముల నాత్మ దలంతురె బుద్ధిశాలు ? రి
క్తోగద! దైవలీలల; నయించునె? ధర్మము లట్టివేళలన్. 198

గీ. దర్శనంబులమతసాంప్రదాయములను। సూక్ష్మగతితత్త్వముయిడి పై జుట్టుకొనెడు
సాంఘికాచార బాహ్య వాసనలచేత। భ్రష్టమగుచుండె నద్వైత పాటవంబు.

మ. స్వవిలాసార్థము స్వీయ జీవమున, సిచ్చన్ జీవజాతంబులన్
భువిఁ బుట్టించి తదీయ కష్టసుఖ విస్ఫూర్తిన్ విలోకించుచున్
భవబంధంబుల దైవమే కుశిచి పోవన్ సృష్టికార్యంబు ధ
ర్మవిధానంబననొప్పుఁ, గాని యెడ సర్వం బొచితిప్మెజెషిన్. 200

క. జ్ఞానుల కద్వైతం, బ । జ్ఞానుల కిల ద్వైతమన నసంభవము కదా !
జ్ఞానాజ్ఞానము లాత్మ । స్థానము నేర్పఱుపఁ గలవె? సత్య మొకటియే. 201

గీ. సౌందర్యమకరాకరంబగు సాగరమును। దాఁటవచ్చు ననాయాస పాటవమునఁ,
బరమ సంసార సాగరోత్తరణశక్తి। కోటికొక్కనికిని సమకూడ దకట ! 202

గీ. దైవ లీలావిలాస సందర్భముననుఁ। గలుగు జీవులు. ధర్మార్థ కామ మోక్ష

సరణి వర్తింపవలెనస సాధ్యమగునె? । చిద్విలాస ప్రధాన మీ సృష్టియెల్ల.

గీ. ధర సురాపానమత్తుఁడు స్థావరముల । జంగమములుగ భావించు చందమునను
జిత్తవిభ్రాంతిఁ జెందిన జీవి జగతి । సత్పదార్థముగఁ దలఁచి సంభ్రమించు. 204

మ. సగుణబ్రహ్మము స్వీయలీలకయి స్వేచ్ఛన్ సృష్టి నద్వైత సి
ద్ధిగఁ గావించుచు జీవ దేహముల మూర్తీభావముం గాంచి చి
త్రగతిం దా విహరించు, సత్యమును విభ్రాంతిన్ సమర్థించు, నీ
భగవద్వైభవమున్ విమర్శ మొనరింపన్ శక్యమే యేరికిన్. 205

గీ. అగ్ని సంతప్తమగు నినుమగ్నిఁ బోలె । నాత్మ సాన్నిధ్యమునఁ జిత్త మధికదీప్తి
నంది విలసిల్లు రక్తాంబుజాంతికమున । నుంచఁబడినట్టి స్ఫటికంబు నొప్పదోఁప.

గీ. శుక్తిరజతమువలెఁ బొడసూపు భ్రాంతి, । నైన శుక్తి మెయగుచుండునటులు బ్రహ్మ
జగమువలెఁ దోఁచినను బ్రహ్మయగు, నదియును । వానియద్వైతమునకె తార్కాణ [మగును.

చ. వరపరమాత్మ నేననెడు భావన రూఢము కాకపూర్వ మీ
శ్వరు సగుణస్థితిం గొలిచి ప్రాప్తిని నిర్గుణుఁ జేయుటెట్లొకో?
స్థిరముగ నొక్కరీతి గణుతించుట న్యాయ్యము ద్వైర్థిహాడునే?
చెరిసగమౌను బ్రహ్మము సృజించిన జీవుల చిత్తవృత్తులన్. 208

క. సగుణబ్రహ్మము స్వీయముగ। జగద్భ్రమను లీలకై యజస్రము కల్పిం
పఁగ నద్వైతము చెల్లును। మఁగటిమి జన్మాంతరములు మాయయు నెగురున్.

క. గుణ రహితున కానంద । ప్రణిధానం బెటులఁ బొందు? గ్రాహ్య గ్రహణో
ల్బణశక్తి నిర్గుణునియం। దణఁగి నశించును నిరామయంబగుఁగాదే ! 210

క. ఆనందం బెటులఁబుకును? । జ్ఞానం బే లేని బ్రహ్మ సాక్షాత్కారం
బౌ నెటు? సగుణబ్రహ్మం । బైనన్ గురుశిష్యభావమైనం గలుగున్. 211

గీ. కూప సోపానములమీఁదఁ గూలిపడిన। కందుకము దొర్లిపడు నీటికందకమున;
మానవుఁడు నట్లె దైవ సంబంధముడుగ। ధర నధోగతిఁ జెంది సంతప్తుఁడగును.

గీ. ఐంద్రజాలికుఁ డాత్మ విద్యావిశేష।మునఁ గనంబడంజేయు నద్భుతము లెల్ల
మిథ్యయే యనఁగనవచ్చుఁ;దథ్యమనఁగ। నిలువఁబడ;వట్లె సంసారవిలసనములు.

గీ. లింగహీనునివండు చేలీలఁ బ్రకృతి । వికృతునొనరింపఁగలదు? నిర్వీర్యునగుణు;
మాయ కలదన్న వ్యర్థసంబంధ మగును। దలఁప హాస్యాస్పదంబైన పలుపరింత.

గీ. సకలగుణసాంద్రుఁడైన విజ్ఞానమయునిఁ । బ్రభుని మృత్పిండముగఁ జేసి వ్యవహరింప
ధరయరాజకమై దుర్విదగ్ధమయ్యె; । యుక్తులెన్నైన నేమి ప్రయోజనంబు? 215

గీ. ఐహికాముష్మికముల కత్యంత వైర,। మొకటి చిక్కిన చిక్కదింకొకటియందు
రదియధర్మము, ఋజుగతినైహికమును। నడుపువానికి రెండు సంధానమగును. 216

గీ. చేతనంబున కుండు విశేషవిధుల । నొలిచినట్టి చిరి, జడమున కొప్పునవిదొ

సంతరించిరి; బ్రహ్మవర్చస్సుగాఁగ; సచ్చిదానందమందుభోజ్యముగునే మొ? 217

గీ. నిత్యములు కాని జగములసత్యములని శ్రుతులనుడువఁగ సత్త్వము శూన్య మనిరి;
మిథ్యయనస్థిరంబు శమించునన్నట్లు; సృష్టి లేదను మీమాంస యెటులు కలుగు? 218

గీ. కల్లు కడవను గలుగు దుర్గంధ మందుఁ । జేరు నాకాశమున కంట నేర నటులు
జీవుఁ డేయుపాధులను వసించి చనిన । వానికంటవు దేహ సంబంధ గతులు. 219

క. నిరతిశయానందంబగు । పరాత్మ జీవాత్మగాన వరలవు జన్మాం
తరములు, జడంబు భౌతిక । శరీరమగుటను స్పృశింపఁజాలవు దానిన్. 220

గీ. వసుధ జీవాత్మలన్నియుఁ బరమపురుషుఁ । డగుటనందఱు మోక్షమునందవలయు;
నరక మొక్కని కైన సందర్భ పడదు; । జీవ మద్వితీయము విభజింపఁ బడదు.

గీ. రాతు రెండశ్వముల సమర్థన మొనర్పఁ । జాలఁ డేక కాలమునందసాధ్యమగును;
ఐహికాముష్మిక ప్రాప్తి నట్లె జీవి । యేక కాలంబునను వసియింప లేఁడు. 222

గీ. నిర్గుణ బ్రహ్మమును తత్త్వ నిష్ఠఁ గొలిచి । మానవునిఁ గూడ నంతటి వానిఁ జేయు
మానసేంద్రియ వ్యాప్తిని మాపుమనిరి, । దాన నైర్గుణ్యసిద్ధి సంధాన మగును.

చ. అహమికవీడి భూతముల నాత్మసమంబుగఁ జూచువాఁడు సం
గ్రహముగ సీశ్వరాంశఁ గనఁగల్గినవాఁడగుఁ, బ్రేమయే ముద్రా

విహామగు దైవతత్త్వమని వ్యక్తి తలంచిన నందు లీనమై
యిహాపర సాధనంబగు, లయించును గిల్బిషమెల్ల భస్మమై. 224
గీ. భానునకు దివారాత్రి సంబంధముండ।నటులు జీవాత్మ పరమాత్మయందులగ్న
మైన పూనికి సాంసారికాఘ ముడుగు।నదియె యవని జీవన్ముక్తి యనఁగఁజెల్లు.
గీ. మగుదలరదము కొఱకనిమఁకుక్కఁ జెవులు।బలివిఁగుట్టించుకొనురీతినలపరాత్మ
లీలకై జగత్సృష్టిఁ గల్పించి యందు।మునిఁగి తేలుచు నుండు విమూఢు పగిది.
మ. సగుణాద్వైతమె రూఢమౌనెడ జగజ్జన్మాంతర ప్రక్రియల్
వగచే జీవుని ముంచు స్వర్గనరక వ్యామోహముల్ పోవు, నై
జగతిం గర్మఫలానుభూతి యిట భోజ్యంబౌను జన్మంబులో,
నిగమప్రోక్త విధిం బరాత్పరుఁడె జన్మించు న్విలాసార్థమై. 227
మ. భగవంతుండన న్యాయమూర్తియు, జగత్ప్రాణుల్ ప్రజావర్గమై
తగినన్ దారుణ శిక్షలంబరపి బాధల్వెట్టఁగా నోపు, నీ
జగతిన్ దైవమె జీవజాతముల నిచ్చల్ జేరి స్వీయాత్మ నే
పుగ శిక్షించు నటంట నమ్మఁదగునే? భూతాత్ముఁ డజ్ఞానియే. 228
మ. అరిషడ్వర్గము లంతరింపఁగ మనోహంకార చిత్తంబు లీ
శ్వర సాన్నిధ్యముఁ జేరలే కొడలితో పాటెల్ల భూతంబులం
గరకాంబూపమమై లయింప సగుణోత్కంఠంబునన్ లీనమై

పరమం దాత్మ పరాత్మ విశ్వవపు సంకర్షంబున న్మించెడిన్. 229

చ. జగముల నెల్లెడ న్వ్యాపము సర్వజడాజడ వస్తుజీవఖా
లి గత మహావిభూతి సమితిన్ భగవంతుఁ డనంజనున్, స్వయం
బుగఁ బొడసూపి పెంపుఁగని పోవు సమిష్టియు వ్యష్టియౌచు నీ
మగఁటిమి నీవు నే ననెడు మాటకుఁ దావల మెట్లు గల్గెడున్? 230

క. తలఁపఁగ జీవం బొక్కటి। ఫలాఫలంబుల ననేక భంగులఁ గుడుచుం
గలదే జననము మరణము। చెలంగు స్వేచ్ఛా విహార జృంభణవృత్తిన్. 231

క. వినువీధి నంబుదావళు। లనేక రూపములఁదాల్చు నవి సత్యములే?
తనివారు నటన లేగద। ఘనంబువలె సృష్టి నడఁచుఁగౌతుక వృత్తిన్. 232

క. ఇనుపొడుపునఁ జనని తమముఁ। గనుంగొనని రీతి నాత్మ గాని పదార్థం
బును నెంచం గాన మిఁదే। సనాతనార్య మత ధర్మసంచిత మవనిన్. 233

క. ఏకమగు భగవదాత్మ య। నేక శరీరంబులన్ మహీస్థలి వెలుఁగన్
లోకంబుల నద్వైతో। ద్రేకంబునఁ జిద్విలాస దీధితు లమరున్. 234

చ. సగుణుఁడు చేయుకార్యముల సాధక బాధక బంధ మోక్ష తీ
వ్ర గతుల నాత్మఁడే యనుభవంబున దిద్దుకొనంగలాఁడు, ఫ

న్నగము స్వకీయ దుర్విషమునన్ మృతిఁగాంచునె ? వృద్ధిఁజెందెడున్
భగవ దనుగ్రహంబు గలవారికిఁ గష్టసుఖంబు లంటునే? 235
క. అవిభాజ్యుండగు దైవం । బవని న్విభజింపఁబడఁ డనంతాత్మలుగా
భవబంధంబులు లీలలు । పవిత్ర సుమనో విలాస భావన లెల్లన్. 236
ఉ. జీవము వచ్చిచేర వికసించును దేహము, జీవిపోవ భూ
తావళి నష్టిచెందు, మృతినందిన దెయ్యది ? జీవమేయగుం;
దావలమైన దీ సరళి, దైవ విలాసము పూరితంబగుం
గేవల విశ్వరాంశజుని నిత్యుని సేయు టసంభవంబగున్. 237
గీ. సగుణ నిర్గుణ శబ్దార్థ జనిత తార।తమ్య మద్వైతమది దనంతముగఁ గలదు
సగుణ మెల్లర కుద్భవ మగు ధరిత్రి।దురవగాహంబు నిర్గుణాద్భుతమతంబు.
క. గజముం బలాయనంబును । నిజంబు గా నియెడ నీవు నేను ససత్య
ప్రవజమై వాదమె యుడుగును।సృజనాభావమున నెల్ల క్షీణముకాదే ? 239
క. నిగమ ప్రోక్త విధానము।లగాధములుకావు చిన్మయంబులు, భాష్యో
క్త గతోపపాదనములే।యగమ్యగోచరములై యపార్థముల నిడున్. 24)
ఉ. జీవుఁడు మాతృగర్భమునఁ జేరి దినక్రమవృద్ధిచే సమ
స్తావయవంబులంగని రయంబునఁ బుట్టు ప్రవర్ధమానుఁడై;
బోవు సమస్తమున్విడిచి, బుద్ధికిఁ జిక్కఁడను చిద్విలాసమిం

దే విశదీకరింపఁబడె నీశ్వరుఁడే విహరించి పోయెడిన్. 241
క. నేనే సగుణబ్రహ్మం । బానంద రసాబ్ధి నోలలాడుట కే యీ
మానవ వపువను నౌకా । యానంబునఁ దిరుగుచుంటి నభిమాన మతిన్. 242
క నానామహాపధారణ । నూని పరాత్పరుడుఁ మానవోచిత ధర్మ
ధ్యానంబుల విహరించి చి । దానందముఁగాంచుచుండె నా నీజగతిన్. 243
గీ నరు లనేకవిధాభరణములఁ జేయు । దురు సువర్ణముచేత నందుఁ గలదెల్ల
హేమ మేయగునట్లు దేహియును దేవ। మునొగిఁబరమాత్మ యానన్యములిలఁగావు
ఉ. ఉన్నది యున్నరీతి ఋషులొప్పగ వ్రాసిన నిట్టిచిక్కు లా
పన్నముగావు, దైవము స్వభావమున న్సగుణుండు, శక్తిసం
పన్నుఁడు, సృష్టిసేయు నిజభావ విలాస వినోద పూర్తి క
త్యున్నతిఁగాంచు వానికృతు లూర్జితముల్ మనయుక్తు లేటికిన్? 245
క. సగుణాద్వైతం బనియనఁ । దగు నీసృష్టి ప్రశస్తదర్శనమును, ప
న్నగమగు మాయను గల్పిం । పఁగ నేటికి? జన్మకర్మ వాసన లేలా? 246
గీ. దైవసంకల్ప మొకదారి, తత్త్వబోధ । వేఱుమార్గంబు, లీలకై విశ్వసృష్టి
తాత్త్వికోపపాదనమున ధర్మనియతి। రెంటికిని లంకెయేరీతి నంటుకొనును? 247

గీ. ఆదిమధ్యాంత రహితుఁడు నద్వితీయుఁ। డీశుఁడొక్కఁడెయనిన నయించుఁగాని,
జీవులన్నియుఁ బ్రకృతియు క్షితి ననాదు।లనిన నదిమెట్టు లద్వైతమగు వివేకి.
క. ద్వైతమును మఱివిశిష్టా।ద్వైతమును దగ నిల సృష్ట్యుపర్మంబగు, న
ద్వైతము తల్లీలాపర। మైతగ మన చిక్కులెల్ల సంతమునందన్.
గీ. గబ్బిలము విశిష్టాద్వైత గతిని జీవ।ద్వైతమున దాసభావంబు ప్రాప్తమగును
దప్తదైవాంశ గలుగు నద్వైతవిధిని। భాసమానము లీలా వికాసమనిన. 250
గీ. జీవుల కనాది నద్వైతి చెలఁగఁ గూర్చి।జ్ఞానముననంత మొనరించుసాహసమున
మధ్వ రామానుజాచార్య మతములఁ గన।నాదిగల దనంతములుజీవాత్మలెల్ల.
గీ. మాది నాల్గవదారి నిర్మలిన మరయ।దైవమే లీలకై జీవ తనువులఁగని
వేడ్క విహరించి విరమించు విశ్వమెల్ల। జీవులే వేరు సృష్టివైచిత్ర్య మిదియె.
ఉ. వానిసఁబోలె దైవ పదపద్మములన్ భజియింతువా దివిన్ ?
వాని సమక్షమందు సమభావముగల్గి వసింతువా యటం ?
బూనిక జన్మజన్మములఁ బొల్పరి యెన్నఁడొ సైక్యమొందువా ?
నేనని చిద్విలాసమున నిండి రసగ్రహణంబొనర్తువా ? 253

# సగుణాద్వైత నిర్వచనము.

---

క. సగుణుం డీశ్వరుఁ డాతఁడు। జగముల లీలకయి సృష్టి సల్పి విలాసం
బుగ నందుఁజొచ్చి, వివిధము। లగు క్రీడలఁదేలి వెడలు నవసానమునన్. 254
గీ. అతఁడు సగుణుండుగాన సృష్ట్యాదికార్య। నిర్వహణసిద్ధికై యాతనికి మఱొక్క
మాయ మొదలగువానిసహాయ మెపుడు। నవసరములేదు సర్వసమర్థుఁడగుట.
క. జీవాకృతి నయ్యీశ్వరుఁ। డే వచ్చుచుఁ బోవుచుండు నేసహజముగుం
గావున జన్మాంతరముల। తో విధిలేదొక్క భవముతో ముక్తుఁడగున్. 256
గీ. కష్టసుఖములు లీలలోఁ గళలు గానఁ। బూర్వజన్మ ఫలంబులై పొసఁగవింకఁ
బ్రకృత కర్మచయంబు లీభవమునందె। ఫలిత మగుఁగాన నుత్తర భవమునున్న.
గీ. చిజ్జడంబులు రెండీశుచే జనించు। కార్యములుగాన భేద మొక్కఱయు లేదు;
ఎంచిచూడస్వరూపవిస్మృతియుఁగూడ। లీలయందొక్కభాగమై తేలెనిందు. 258
" శ్లో. బుద్ధీకర్మేంద్రియప్రాణపంచకైర్మనసాధియా
శరీరంసప్తదశభిస్సూక్ష్మంతల్లింగముచ్యతే. 259
గీ. ఐదుజ్ఞానేంద్రియంబులు నైదుప్రాణములునుగర్మేంద్రియములైదుబుద్ధిమనసుఁ

గూఁడి సప్తదశాంగముల్ కోమరిమిగిలి।లింగపూతనూత్నాంగములు నోఁజెలంగుధరణి.”
గీ. అరయ నీసూక్ష్మ తనువుదేహాంతమందు । జీవువెంటాడుననుటనిషిద్ధముగుచు,
బాహ్యతను సంప్రవృత్తికై పరగ వెలసి।దానితోఁడన, తుదకు నంతంబునందు.
క. ఇవి మాసిద్ధాంతములగు।నివిగా కేమిందు ననువదించిన వెల్లన్
వివరంబు లితర మతముల । కవి యన్యములౌట మాకు నననుమతంబుల్.262

# జన్మ కర్మములు.

సీ. కర్మనిర్మిత మయ్యెఁగాన దేహమున నీ ప్రారబ్ధమనుభవింపఁబడుఁగాక।
తగ ననాదియగు నాత్మకెటు యుక్తంబౌనా కర్మనిర్మితమది గాదుగాన
నజుఁడు నిత్యుఁడు సత్యుఁడను నమోఘశ్రుతి ననుసరించి తదాత్మునకైతనరు
వాని కారబ్ధకల్పన మెట్టులతుకు? వి గ్రహాభావకునకుఁ బ్రారబ్ధసిద్ధి,
గీ. జ్ఞాని కారూప మిష్టంబు గాదుగాన । లేదు ప్రారబ్ధ మనఁగ; శరీరమునకు
నైన నదిభ్రాంతి యెట్టుల ధ్వస్తవస్తు।వునకుసత్త్వంబును,నసత్త్వమునకుజన్మ
మును, నజమునకుఁ బ్రారబ్ధమును మరెట్లు? 263
ఆ. జ్ఞానమున, సమూలమైనయజ్ఞానకా । ర్యంబునకు వినాశమయ్యె నేని

నీశరీరమెట్లు తెసలాగునని సంది । యంబుఁ జెంచు మందులందఱికిని. 264

గీ. "తగుసమాధానమొసఁగ వేదంబు బాహ్యదృష్టిఁ బ్రారబ్ధమున్నదంచెఱుఁగఁబలికె
గాని దేహాది సత్యత్వకలన బుధుల । కనువదింపఁగఁగాదు, స్వానుభవంబు
వెలసెఁ బ్రత్యేక పరమార్థ విషయమగుచు." 265

క. ఈసిద్ధాంతము ముక్తుల । కై సలిపెను శంకరుండు గావున జీవుం
డీసరణి నిత్యముక్తుం । డౌ సంసృతి లేదు, లేదు ప్రారబ్ధంబున్. 266

గీ. దైవసంకల్పమున వచ్చిపోవు జీవు । లకును కర్తృత్వమెట్లు చెలంగఁగలదు?
జన్మకర్మములకును బ్రస్తావ ముడుఁగు। బాపపుణ్యానుభవము లెవ్వరికి సోకు? 267

క. పరమాత్మయు జీవాత్మలు । స్థిరములెయగునెడల దైవ తేజంబడఁగున్
పర సృష్టి స్థితి లయములు। పరుషములగు, జీవహింసఁ బరతంత్రములౌ. 268

క. జీవాత్మలు ప్రత్యేకముఁ । దావలముగ నున్న యెడల ధర్మాధర్మో
జ్జీవన మవసరమగునే । మోవరలనివాని కెట్టులోదవును శిక్షల్. 269

గీ. జీవు లాద్యంత రహితు లక్షీణులైన। సృష్టియును సృష్టికర్త వేంచేతు రెటకో;
సగుణనిర్గుణమీమాంస తెగిరిపోవు। మనవిమర్శకు వలయు సాధనములుడుగు 270

గీ. అన లనాద్యులై యట్టి జీవాత్మలెన్ని? । వానికిం దైవమునకు సంబంధమేమి ?

కర్మముననాదియనుటకుఁగతిమఁజేది? । మాయయెటువచ్చెసిద్ధిగా మాయికేనకు.

క. నరులను భయపెట్టుటకై । నరకంబును జన్మకర్మ నటనంబులునుం
బరికల్పించిరియు మిథ్యా । పరముగఁబూరించి రార్యవర్యులు తుదకున్. 272

క. భయభక్తులు కలిగించుట । కయి కూర్చిన తర్కవిధులనంతములై ని
శ్చయతత్త్వంబునకునుసం।శయ హేతువులగుచుఁదుదకసాధ్యములయ్యెన్. 273

గీ. కార్యకారణవిధులు నిక్కములెయ్యైన । వానిగతులను బరికింప వశముగాక
కర్మజన్మముల నసాధ్యకల్పితముల । నంటఁగట్టిరి పెద్దలనాదు లనుచు. 274

గీ. జనన మరణంబు, లజ్ఞత జన్మకర్మ। ములనుదై వాంశముల నొంచఁగలవె? లీల
గాన నాభాసవైచిత్ర్య కలనయగును । మరుమరీచికల్ జీవసమ్మర్దనములు. 275

గీ. కాల చక్రంబునంబడి కల్పకల్ప । ములను జీవులు తిరుగాడ ముక్తియెచటఁ
గలుగు? నెవ్వరి? కెప్పుడా కాంక్షకలదె? । దైవమేమగునట్టిసందర్భమునను. 276

గీ. దైవమును నామమాత్రునిఁదనరఁజేసి,।మాయఁగల్పించి, జన్మకర్ములఁగూర్చి,
సకలబీభత్సమొనరించి వికటగతుల।నదియెయద్వైతమనుటసాహసముగాదె? 277

గీ. ఆది లేనట్టి సంస్థల కంతముండ । దనెడు సిద్ధాంతమును ద్రోయ నలవి గాదు;
మాయయుఁగర్మమునసాదు లేయగునెడ।జ్ఞానమున వానికంతముగలుగ దెపుడు 278

చ. వరదుని నిర్గుణుండనిన వమ్మగు; సృష్టిని నిర్వహింప నా
సురిఁ బ్రకృతిన్ సృజించి పరిశుద్ధునిఁ జేర్చిరి, పైన స్వర్గమున్

నరకము జన్మకర్మముల నాటిరి జీవులనాదులౌదు రే ?
హరహర ! యేమి యీ మతరహస్యము లెన్నఁదరంబె ? ధాతకున్. 279

ఉ. నేత్రములుం గనుంగొనవు, నిర్మలరూపము లేగు లోనికిన్,
శ్రోత్రము లాలకింపవు నిరూపిత నాదము వచ్చి సోకెడిన్,
గాత్రము నింద్రియంబులు వికాసములౌను బహిర్ముఖంబుగా;
సూత్రము దైవ హస్తగత శోభయె వశ్యముకాదు జీవికిన్. 280

గీ. అయ్యపారిని జేయంగ నయ్యెఁగోఁతి । యన్నగతి జన్మకర్మము లంటఁగట్టి
దురవగాహంబు చేసిరిపరమపురుషు । చిద్విలాసమునెల్ల నౌచితినిమించి. 281

చ. జపములు యజ్ఞదానముఖ సంస్థలు నోములు ప్రార్థనాదులున్,
నిపుణతరోపవాసములు నిశ్చలభక్తియు సద్వ్రతంబులున్,
విపుల ఫలింపవంచు నుడివెన్మను శంకరుఁడున్, వసిష్ఠుఁడున్
వపువులు జీవముల్ధరణి వ్యక్తిగతంబులుకావు దైవమే. 282

చ. జగతికిఁ గర్తలేఁడనఁ బోసంగక దేవుని నొప్పుకొంటచే
సగుణత గూడె, నిర్గుణత సంభవ మెట్లగుఁ ? బృథ్వి జీవు తే
నగిధి ననాదులౌఁ ? బ్రకృతి భావన మ్మెటిక్కి ? జన్మకర్మముల్

తగునెటు ? నద్వితీయమగు తత్త్వము భగ్నముగాదె ? పీనిచేన్. 283

చ. ప్రకృతియొ దైవమో యెవఁడొ ప్రాకృత సృష్టిని జేయనేల ? బా
ధకమగు జన్మకర్మ పరతంత్రితఁ గూర్పఁగనేల ? ధర్మమా ?
సకల చరాచరాత్మక మసంగత ఖేదపరీతమైన సృ
ష్టికిఁ బ్రథఁజెందఁగావలెఁ గృశించెడి జీవులఁగాంచి స్రష్టయున్. 284

చ. సకలము మిథ్యయౌనెడల సత్యములౌనెటు జీవకోట్లు? ప్రా
యికముగఁ దా మనాదులగునేని మహేశ్వరుఁడొక్కఁడెట్లగుం?
బ్రకృతి యనాదియైన భగవానుని యక్కఱ యేమి ? జీవి కా
ర్మిక వశమేల కావలె? దరింపఁగఁజాలదె యొక్క జన్మమే. 285

గీ. లీలకై బ్రహ్మ మీ జగత్సృష్టిఁజేసెఁ । దాన చైతన్యమై ప్రభుత్వంబు సలుప
నొక్క జన్మముఁజాలదే? యొక్క లీల । పూర్ణముగ ననుభూతినిబొందుటకును 286

చ. గగనము శూన్యమౌనెడ జగంబులనెల్లను సృష్టిఁజేసి, తాఁ
బగఁగొని, జన్మకర్మములఁబంచి, యయోమయ దుర్విపాక మా
ర్గ్యగతిని హింసఁగూర్చుటది న్యాయమొ? మాయయొ? దైవమో! త్రయీ
నిగదిత తత్త్వమిద్ధియస సిద్ధిగసైష్టిక వేదవేత్తలున్. 287

గీ. పూర్వ జన్మానుభవ నిజస్మరణమున్న । భావిసంస్కారసాధనోపాయ మగును
మానవేతరజీవులమాటయేమొ?।నరులకేమియుఁదెలియదన్యాయమకట! 288

గీ. బడిని బిల్లలు చదువును బట్టి క్రింది । మీఁదితరగతులకుఁబోవుమాదిరిగను
గర్మసంస్కారమున జీవగణ మనేక । జన్మధారణముసఁదరించఁగలదెట్లు? 289
క. చదువుల బడి పెట్టుటక । భ్యుదయముగా జీవసృష్టి పొదుగునె దైవం
బది దారుణకృత్యంబగుఁ । గద! కోటికి నొక్కఁడైనఁ గడతేరఁ డహో ! 290
క. చదువులబడి సామ్యము మన । కొదవదు బహుజన్మగతుల నూర్జిత మగుటన్
సదమల విద్యాభ్యాసా । భ్యుదయము జన్మాంతర ప్రయుక్తం బగునే? 291
క. చదువులఁదరగతు లెక్కెడి । విధమున జ్ఞానాభివృద్ధి పెరుగఁగ వలయుం
గద ! జన్మజన్మమునకును । నడికలుగని కర్మనియతు లపమార్గములౌ. 292
గీ. కారణము లేని కార్యము కలుగద నెడు । మానవానుభవంబు నమ్మదగుఁగాని
కార్యకారణముల కాదికారణమగు । తత్త్వమున కెట్టికారణోత్పత్తి కలదు?293
గీ. పుట్టిచచ్చెడి దేహికిఁ బుణ్యపాప । జన్మకర్మంబులనుగూర్చి చంపనేల ?
చావుతోఁబోవుసర్వసంస్కారములును। మరణదండన మనశిక్షపరిసమాప్తి.294
గీ. బాల్యమునసుండికనుసనుభవము లెల్ల। స్మరణకునువచ్చు నెన్నఁడుమరువమెవియు-
బూర్వజన్మమెయుండిన స్ఫురణవిడునె ?। లేదుగావున నే స్మృతి లేదు మనకు.
గీ. పుణ్యమొనరింప స్వర్గముఁబొందఁ గలరు,। పాప మొనరింపనరకముప్రాప్తమగును

కర్మఫలములుజంటగఁగలిగియుండ। జన్మజన్మంబులెటులుభోజ్యంబులగును? 296

ఉ. పుట్టినబిడ్డ కెద్దియుఁ బ్రబోధము గానను, దేహి దేహముల్
పుట్టి క్రమాభివృద్ధిఁగని పొల్పెసలారును, పూర్వజన్మ సం
ఘట్టన సాంప్రదాయములఁగాంచను సుంతయు, వ్యర్థవాదముల్;
గిట్టవనేకజన్మముల కృత్రిమవాదము లీశ్వరాత్మకున్. 297

గీ. అరయ సర్వజ్ఞుఁడగు దైవ మఖిలసృష్టి। కాముఁడై కర్మములసల్పఁగానరుండు
కర్మసన్న్యాసి నిష్కామ్యకర్మియగునె? ।సృష్టికర్తనుమించు నేజీవుఁడవని? 293

మ. భగవల్లీలకె సృష్టియౌ నెడల జీవంబుల్ విలాసార్థ మీ
జగతిం బుట్టి,చరించి, చచ్చు నెడలం జాలుంగదా? నిత్యతం
బగ జన్మాంతర బాధలం గుడుప భావ్యంబెట్లగున్ ? బుద్ధినెం
చఁగ ధర్మంబనలేము; పెద్దలెటు లిచ్చంగూర్చిరో! దైవమా ! 299

గీ. తనువుప్రకృతినందిపంచభూతములఁగలియు।జీవిదైవాంశమగుటస్పృశింపఁబడను
పాపపుణ్యము లెవరికి ప్రాప్తములగు। ఘటము విడిచిన జీవి కెక్కరణి పోవు?

మ. నరుఁడై చేసిన కార్యసారముల నెన్నన్ శ్వానమై పొందఁగాఁ
దరమౌనే! శునక ప్రవృత్తి నరతత్త్వప్రక్రియం బొందునే ?
ధర జాతీయ విభాగముల్ ప్రకృతి సిద్ధంబుల్, విజాతీయతన్
వరలంజాలవు, కోఁతికిన్ శునక ముత్పన్నంబు గాదెన్నఁడున్. 301

గీ. గోడ కభిముఖముగ బంతిఁగొట్టఁ దిరిగి। వచ్చి మనకది తాకెడు పగిది దేవి !
చెడుతలంపులుమనమీఁదఁబడునుమగుడి। కార్యకారణగతులసంస్కారమిదియె

గీ. కర్తయున్,భోక్త,సంహర్త,స్మర్తయునగుఁ।గాలుఁ డేయనివాల్మీకిఘనతఁబలికె
యోగవాసిష్ఠమునయాదవనోదయాబ్జ।మునకునాతండచంద్రుఁడౌపోల్చిచూడ.

గీ. కర్మవాదులు దైవమక్కఱయె లేదు।ప్రాక్త నాధునాతన కర్మవశ, మనాది
యనెద రదియెంతవఱకున్యాయంబొ?కాని। ధరనిరీశ్వర వాదంబుతగదుమనకు.

గీ. ప్రాక్తనైహికపురుషకారములు రెండు। యుద్ధమొనరించువానిలోనూర్జితమగు
నదియె విజయంబుఁగాంచు నియ్యవసరమున।దైవమనునది లేదనెఁ దగవసిష్ఠు.

గీ. సుగుణములు వృద్ధినందిన సుఖములొదవు। దుర్గుణంబులుపెరిగినదుఃఖమొదవు
వీని సంఘర్షణంబె జీవిత విధాన। మందు జయమందువాఁడె ధురంధరుండు.

చ. బలులు మనీషులై చెలఁగు ప్రాజ్ఞ నిరీశ్వరవాదు లందఱుం
గలదొక తత్త్వమందు రది కాలమొ కర్మమొ దైవమేయనం
గలుగు విఘాతమేమి? కనుగానక నాస్తికుఁడై స్వతంత్రతన్
మెలఁగి నశించు కన్నఁ గడుమేలగు నాస్తిక ధర్మ పద్ధతుల్. 307

చ. మతములఁ గూర్చునట్టి గుణమాన్యులు ధీరులు తాపసోత్తముల్

ప్రతిభను దైవముం బరమ పావన మూర్తిని జేయనెంచి నీ
తత్ప్రకృతియని నిర్గుణాత్మనిక నెంచిరి, మాయయు, జన్మకర్మముల్
జతపడఁజేసి ఘోరముగ సల్పిరి సృష్టివిశేష మంతయున్. 308

ఉ. లీలకు మాయ నేర్పఱచి సృష్టిగడంగుచుఁ జేతనాకృతిం
దాల్చినంతఁ గర్మమను దారుణ వాసన గూడె, దానిఁబోఁ
ద్రోలుట కిన్ని వేషముల దొర్లుట, యైనను మాయఁగూర్చుటన్
లీలయొయౌను దేవునికి లేశమునంటవు వాసనావ్యథల్. 309

గీ. ఇతర విషయము లేరీతి నెన్నఁబడిన। జీవి జన్మాంతరంబులఁ జెందు ననుట
పమర చైతన్యమునకు సభ్యంబుగాదు।స్వీయ కల్పన యనిన హాసింపనగును.

గీ. ఏక చైతన్య మిట్టులనేక దేహ। ములను లీలకుఁ జొచ్చిన ముగియఁజేయు
తనువువిడనాడ; నట్టిచైతన్యమునక। నేకజన్మధారణఁగూర్చిహింసఁగను నే?311

గీ. మరణ కాలమునం దెట్టిమనసు కలుగు। నందు కనుగుణమైన జన్మాంతరంబు
గలుగుచుండును,సంకల్పములునశించు।వఱకునందురు;దైవమీవ్యథనుగను నే? 312

గీ. దైవమే బద్ధజీవ చైతన్యమగుచు। మోక్షమునుగాంచఁ దీవ్రమౌ దీక్షఁబూని
కర్మఫలములననుభవగ్రంథియగుట। విశ్వసనపాత్రమౌనె? ప్రవీణునకును.313

ఉ. జీవుఁడు చేతనం బిలనశింపఁడు; దేహము పాంచభౌతికం
బై వసుధాదులం గలియు; సంతతితో విరమింపనోఁగడా!

కేవల మీశ్వరాంశమునకే తగిలించిరి జన్మకర్మ సం
భావన; యిట్టికల్పనలు పుట్టును బండిత పామరాళికిన్. 314

గీ. ఎల్ల కర్మముల్ విడుట దేహికిఁ దరంబు । గాదు సుమ్మన్న దైన త్యాగమునఁ గర్మ
ఫలపరిత్యాగమని చెప్పఁబడుఁ జుమయ్య! । పార్థ! నిష్కామివై జయప్రదుఁడవగుము.

గీ. కర్మమున జీవి జీవిచే కర్మమునిల । జనితమగు ననాదిగ ననఁ జనదు, మూల
కారణంబగు దైవమొక్కరణి నిలుచు? । నాస్తికంబగు; తత్త్వసంధానమిదియె? 316

గీ. కర్మఫలములు గూర్చు స్వర్గ నరకముల । ననక పోయినఁ బాపభీతిని త్యజించి
నరులు బీభత్స మొనరించెదరనఁ దగునె । తత్త్వమీమాంసకీయుక్తి తగదు గాదె.

గీ. కర్మములు మానసోత్పన్న కార్యములగుఁ । గనుక ఫలములఁ జిత్తమే యనుభవించు
నదియుఁ దాత్కాలికమగు జన్మాంతరముల । నేల కూర్చిరి నరక మేళ్ళలఁ బొసఁగు?

గీ. సర్వదుఃఖోపశమనుఁడౌ శమనుఁడరయఁ । బరమమిత్రుఁడు దేహసంబంధమునకు
"జన్మనాశాయ తేదుఃఖశల్య" యనెడు । పలుకు సత్యము; దైవలీలలనఁ దగును.

ఉ. జీవులఁ జిద్విలాసమున సృష్టియొనర్చిన మృత్యువంతచూ ;
దేవుని చేతనంబయిన దేవుని జేరెద రెట్టులైననుం
జావును దాఁటి నిల్చుటది సాధ్యము యోగ్యము కాదు; అన్యముల్

కేవల కల్పనల్ ప్రతిఫలించెడి చిత్తవివేక సంపదల్. 320

గీ. ధరణి నవతారపురుషులై తనరువారె । కల్పకల్పంబులం దిరుగ జనియించు
గతియొప్పెను; పరమాత్మఁగలియకున్న। జీవకోటికినిఁకముక్తిచిక్కు టెట్లు? 321

గీ. ఆతపంబున ఛాయయు, నగ్నిమంచు। సూర్యునం దంధకారము పోకనల్లె
సృష్టి బీజరూపంబునఁ జిత్తునందుఁ। బ్రళయమందున లీనమై వరలదెపుడు. 322

గీ. నిర్గుణుఁడు దైవమెట్టులో నియతిఁదప్పి। మాయఁగల్పించె నదిసృష్టి చేయుననిరి
ప్రళయమందున బీజరూపమున సృష్టి। వానియందేల లీనమై వరలఁగలదు. 323

గీ. కలుగుకర్మేంద్రియవ్యాప్తికలుషమెయగు। రీతిజ్ఞానేంద్రియాసక్త్యపూతమగును
గామవృత్తిని బడఁతిని గాంచు నెడల। వ్యభిచరించినగతి పాపమగుధరిత్రి. 324

గీ. బీజమునశించివృక్షమై పెరిగివిరుగు । బ్రహ్మమునశింపక యెజగద్భ్రాంతిఁగూర్చు
బీజ మాకారవంత ముద్భిజ్జమగును। వర నిరాకారుఁడౌ పరబ్రహ్మ మనఁగ.

గీ. జనుఁడు నిష్కామ్యకర్మ ప్రసక్తిఁబడిన। పద్మపత్రంబునం దంబుపాత మటులు
నిర్జితేంద్రియుఁడై ఫలవర్జితుఁడగు। బ్రదికియుండఁగ ముక్తినిబడయుటిదియె. 326

గీ. ధరణి లౌకిక వైదిక ధర్మతతులు। దేహమాత్రార్థములు జీవతృప్తిఁ గూర్చు
కొఱకుఁగావనుచు వసిష్ఠుఁగూడఁబలికె। నాత్మ కివియు లీలావిలాసార్థమగును.

గీ. స్వీయ సౌకర్యమునకును జింతవిడిచి । ధరఁబరోపకారార్థమిదంశరీర
మనెడు దృష్టితో నెట్టికార్యములనైనఁ। జేయ నిష్కామ్యకర్ముఁడై సిద్ధిఁగాంచు.

గీ. ఆత్మసాన్నిధ్యమునజగద్వ్యాప్తకార్య|ములను జేయుచునుంటినన్ మోహరమునఁ
గార్యరచనఁ బ్రవృత్తిని గాంచువాఁడు|ముక్తుఁడని నామతమనెను మునివసిష్ఠు.

గీ. కలుగు సంసార మెట్టులో కలిగెనింక|నైనఁ గర్తృత్వమునువీడి సాక్షివగుము
అదియె నిష్కామకర్మమై శిథిలమగును|ననుఘటింపదుసాంసారికాఘ మిఁకను.

గీ. తల్లి బిడ్డకు మందిచ్చు తఱులయందుఁ|బండునిచ్చెదనని చెప్పి భ్రమనుగొలుపు
నటులెకర్మంబులకుస్వర్గమనుభవమగు|నందురవిచేయఁ బ్రోత్సాహమునగునటంచు.

గీ. నిప్పుతాకిన నొవ్వఁడో నిరయమందుఁ|గాలునాచేయి? వెంటనేకాలు, నటులు
కార్యకారణవిధులు సకాలముననె| కలుగు మరణాంతరంబునఁ గలుగవెపుడు.

గీ. కార్యకారణవిధుల సంస్కారములిల|నెప్పటికపుడె కల్గు నైహికములవియు
జన్మజన్మాంతరములకు సంక్రమించు|నన నసంభవం బజ్ఞాన జనితమగును. 333

గీ. జలములో మునిగినను జీవిచచ్చునపుడె|యగ్నిఁజొచ్చినదేహమునాహుతియగు
విషముఁద్రాగినఁజచ్చు నిమిషమునందు|కర్మఫలములు వెంటనే కలుగునట్లు.

గీ. మాతృగర్భంబునను నవ మాసములును|గలుగు సంబంధమేదియో కలదుగాని
భూపతనమైనదాది జీవులకునెట్టి|బంధముండదు నటనయె స్వార్థమునకు. 335

గీ. సౌఖ్యముగ జీవనంబిలజరుగునపుడు|దైవమతతత్త్వవిషయముల్ దలఁపరెవరుఁ

గష్టకాలమునం దమోఘమునుగఁ బూర్వ।జన్మకర్మానుభవమున సమ్మతింత్రు.
ఉ. క్షితి మృత్యుద్గతిఁ జెందు మానవ జగజ్జీవాత్మ లొక్కుమ్మడిం
బితృలోకంబున సూక్ష్మదేహములతో నిర్లిప్తులై కైస్తవ
స్తుతిసాన్నిధ్యములం దరింతు, రదియెంతో మేలు, జన్మాంతర
ప్రతిబంధంబునకంటె మానవుల కార్తత్రాణుఁడౌ క్రీస్తుతాన్. 337
గీ. శివుని యాజ్ఞను వడయక చీమయైన।గుట్టదను సామ్యమును జెప్పకొనెదరవని
గావునను మనకష్టసుఖంబులెల్ల।దైవమే నిర్ధరించు స్వస్థానమునను. 338
గీ. బ్రహ్మ సృష్టించినప్పుడె వ్రాసెనుదుట।మూఁడుపంక్తులనని జనులాడుచుండు
గానఁ గర్తృత్వమేరీతిఁ గలుగు మనకు।ఆర్యులుం గైస్తవులుఁ గూడ నందురిటులు.
చ. భువిఁ బడవేయునప్పుడె ప్రభుండిటు జీవి సమస్తచర్యలన్
వివరముచేసి పంపును, భువిన్మనకార్యములెల్లనట్లు సం
భవమగు, నాటక ప్రతిభవానిదె జీవులుఁ గూడ నట్టివా
రవుటఁ జరించిపోయిన జయప్రదమౌ విభులీలలన్నియున్. 340
గీ. వసుధ జనుషాంధునకు సృష్టి వైభవములు।గోచరించనిరీతి నీ కువలయమున
నుద్భవించిన జీవుల కూర్ధ్వలోక।సచ్చిదానంద పదవి దృశ్యంబుగాదు. 341
గీ. బుద్బుదంబుల జలము స్వబుద్ధి లయము।సేయురీతిఁ గాలుండు నశింపఁజేయు
భుంజబ్రహ్మరుద్రాదిసురోత్తములను।మానవులకుది క్కెవరు క్షేమంబుఁ గొలుప?

గీ. వచ్చి యిచ్చటి ముచ్చట లిచ్చఁగాంచి । వచ్చినటుమెచ్చి తిరిగిపోవచ్చుఁగాని
యగణితములగుజన్మములంటఁగట్టు । కొనియగాధమునన్ బ్రహ్మ గూలునొకొ?
క. బలహీను లణఁగిపోదురు । బలాతిశయులే జయించువారలు ధరణిన్
బలమే దైవము ధర్మము। బలంబునకె ద్రుంచు సృష్టివైదుష్యంబున్. 344

# మాయా మ న స్సులు.

గీ. భావనాపాటవమున సంప్రాప్తములగు। నవని నీచోచ్చదశలు జీవాత్మలకును
మనసు కుదిరిన నీచమే ఘనతరమగుఁ। గాని-చో ఘనంబే నీచగతిగఁ దోఁచు.
గీ. భావములజీవిస్వాధీనపఱచుకొనినఁ । బరమిహామునం దెవునకుసంప్రాప్తమగును
గోళ్లు. పొళ్లేళ్ళు వడిని డీకొనినఁజచ్చు । వఱకుఁబోరాడు బాధలసరకు గొనవు,
గీ. పోరునందును మదనుని పోరునందు। లగ్నమైనట్టి జంతుజాలములు చిత్త
వృత్తి నేకాగ్రమొనరించి యిటు త్రిగిలవు। కొట్టినను నవి పట్టినపట్టు విడవు. 347
గీ. దృష్టివిషయాంతరమ్మునమ్మూర్తిభవింప। సన్నిహితసర్వవిషయపరిసక్తియుడుగుఁ

తెలుఁగు శరం చేంద్రియవ్యాప్తి నిలిచిపోవు। మానసిక మిల్లఁగష్టసుఖానుభూతి.

గీ. దైవకల్పిత తనుమనో ధర్మములను। నిగ్రహించెదమని యోగనిష్ఠఁదవిలి
పిచ్చిదారులఁబడెదరు పెద్దలయము। దైవ నిర్మాణమున కడ్డుఁదగులఁ గలమె?

గీ. గతము మృతమగు నాగతకాల మంధ। కారబంధురమగు నేటిక్షణమె మనది
యక్షియు దైవ విలాసార్థ మగునుగాని। జీవి చిత్తప్రవృత్తికిఁ జిక్కుదెపుడు.

క. మాయాతీత బ్రహ్మ మె। మాయను వీక్షించి సృష్టిమతంబడి యెన్
మాయామయులగు జీవులు। మాయకతీతులయి జ్ఞానమయు లగుదురెటుల్.

మ. అరిషడ్వర్గము లాత్మ బుద్ధియు మనోహంకార చిత్తంబు లీ
శ్వరలీలల్, భువి భౌతికంబులనఁగన్ శక్యంబుగా, దాట సు
స్థిరముల్ వానినిజంప నేరితరమా ? దివ్యప్రభావంబులౌ
టరయన్ లీలకు మూలకందములుగావా! మానసోద్రేకముల్. 352

గీ. ధరణి సకలేంద్రియానందకరములైన। భోగములనంతదుఃఖాంతములు, క్షణికము
లగును దద్వాంఛితము విషాదాంతమగును। వారివాహముఁగాంచినబర్హిపగిది.

గీ. విషయముల మోహమయమ్ములు వేఱు వేఱు। వాని సంబంధములు మనఃప్రాపితములు
కేవలాళీకములకు విక్రీతునివలె। దాస్య మొనరించు జీవి వృథాప్రసక్తి. 354

గీ. పుట్టుకామ్యంబులనుబరిపూర్ణముగను। వసుధననుభవించినఁ దృప్తిపొసఁగ దెపుడు
బుద్ధి నదికట్టినఁ దొలంగిపోవు నవియె। లేనిచో సహస్రగుణిత మానములగు.

గీ. విషయ విషసర్ప దంష్ట్రి ప్రవిష్టజీవి। కాయు వాయూస కారణంబగు ధరిత్రి
జ్ఞానవటిమను సమదృష్టి నూనువాని। కాయు వానంద దాయకంబగుసతంబు.
గీ. నరుఁడు మమకారమునఁజిక్కి నాశమగును। దానిబంధింపనిర్మల తత్త్వమబ్బుఁ
బుత్రిమిత్రికళత్రాది శత్రువితతి। మమత నెసకొల్పి ముక్తిసంపద నణంచు.
గీ. జీర్ణకామిని వతెఁ దృష్ణ శిథిలమయ్యుఁ। జిత్తవృత్తుల వెంబడి హత్తియుండు
నదియె సంసార శోక మోహాదికముల। కాటపట్టగునాభాసనాటకమున. 358
గీ. ఘనములలమియహస్కరుఁగప్పివేయు। నటులహంకృతివిలసిల్లియాత్మఁగప్పుఁ;
గాంతులనుగాన మొనరింపఁగలవిపంచి। శత్రుషట్కమునివసించుసత్రవాటి. 359
గీ. కతక సంశ్లేష వశమునఁగలుష జలము। నిష్కలుషమగురీతి సన్నిష్ఠవలనఁ
జిత్తశుద్ధినిగాంచునుజీవితుదకు। స్వస్వరూపముఁగాంచుభాస్వంతముగను 360
గీ. శైలునం బోవువానికిఁ బ్రక్కనుండు। స్థావరంబులు పరుగిడు సరణిఁదోఁచు
నటు లలీక సంసారమాయా ప్రవృత్తి। స్థిరముగాఁదోఁచునైహికజీవితమున. 361
గీ. జీవి యెప్పుడు ముక్తుఁడు దైవమగుట,। వానినావరించినభ్రాంతిఁబాఱఁదోలు
టకయి విశ్వప్రయత్నంబునకుఁ గడంగ। వలయు నైతానుపట్టినపట్టువీడ 362
గీ. అద్దమున జగత్ప్రతిబింబ మలమునున్నఁ। గేవలాత్మస్వరూపంబు గీలుకొనును

మానసేంద్రియ సంస్పర్శమరపుఁగనిన । నెగసిపోవునుజగదాది సృష్టియెల్ల. 363

గీ. మంచు, వేడిమినీరుగ మాఱునట్టులు । వాసనాశూన్యమగు చిత్తవైభవంబు
తపముచే వశమైనట్టి ధన్యజనుఁడు । క్రీస్తువలె శుద్ధసత్త్వ శరీరియగును. 364

గీ. చూడఁదలఁచిన నేత్రముల్ చూడఁగలవు। వినఁదలంచిన వీనులువినఁగనోపుఁ
జిత్త మేపనిఁ జేయింప సిద్ధపడిన।నవయవంబులు వానినే యాచరించు. 365

గీ. వాసనాశూన్యుఁడైధరవరలువాఁడు। యోగ్యసంసారముననుండియొప్పుచున్న
నధికుఁడనియు జీవన్ముక్తుఁడనియు, ద్రఢిమఁ। బెద్దలందురు వాని జీవితఃపువలన.

గీ. ఆ మమునఁదీపియునుమిరియమునఁగారముండునట్టులుపరమాత్మనుండుమాయ
దాని లీలలె సృష్టికాధారములగు।బ్రహ్మ కంటియునంటక వరలుజగము. 367

గీ. అనుదినంబును నిద్రయం దణఁగియుండు।మనసుజీవిని మరణాంతమునవిడువ
దనుట కాధారమెటుగల్గు?నట్టులైన।నొక్కపట్టునవిడువకయుండవలయు. 368

గీ. కట్టెలేకున్నఁ జల్లారఁగలదు నిప్పు। చిత్తమభ్యాసవశత నశించునెడల
విషయ సందర్శనములెల్ల విశ్రమించు।శుద్ధచైతన్య మాత్మయశోభ మిగులు.

గీ. చిత్తమేమాయ, సైతాను, సృష్టిహేతు।వది పరబ్రహ్మచేఁబుట్టి యతనిజీవ
తతిని భ్రమపెట్టిసంసార దావమందుఁ।జిరముఁబడఁద్రోయుచుండు,నిశ్చింతతోడ.

గీ. తనుమనంబులు వైరు లుత్పత్తినుండి, । తనువుఖేదపడుచుమనోదమనమునకు
యత్నమొనరించుమనసుదేహమును స్వీయదుఃఖములయందెపుడుబడద్రోయుచు ను

ఉ. కాలము దూరమున్ వ్యవధిఁగాంచము జీవుల చిత్తవృత్తులన్
లీలఁ దలంచినంత సరళిం జిరకాల విశేషమెల్లఁ దా
త్కాలికమట్లతోఁచుఁ, గడుదవ్వగు దృశ్యములైన సన్నిధిం
గ్రాలుఁదలంచినంత, మననంబున జీవికి సాధ్యమన్నియున్. 372

చ. జగముల సృష్టికంతకు నజస్రము చిత్తమె హేతువందు రీ
మగఁటిమి నాత్మనిష్ఠగరిమన్ వశమైన జగంబు లీనమై
తగునట; దేహబాధల వెతల్ హాతమౌనె? మనస్సునిట్టిదే
యగుఁ; బరమాత్మ నంటుకొని హత్తిన మాయను ద్రోల శక్యమే? 373

ఉ. దైవమునంటి సృష్టిపరతంత్రత దిగ్విజయంబుఁగొన్న మా
యావి మనస్సు; ధాన్యమునకావరణంబగు పొట్టువంటిదా;
జీవులు దంచి పొట్టునెడసేయ సమర్థులు దైవశక్తి మా
యావృతమయ్యె; సాధనమహా! కనుపింపదు చిత్త హత్యకున్. 374

గీ. చిత్తసంకల్పము లెకార్యసిద్ధిఁగాంచు । దృఢములైనను;మానసేంద్రియమునందు
సోకకుండిన నుత్పత్తి లేకపోవు; । మనసునం దంకురించిన పనిమెప్రబలు 375

గీ. దారమునకంటె వస్త్రము వేఱుకాని । పగిదిజీవాత్మపరమాత్మ భాగమగును;

చిత్త సంపర్కమున జగత్సృష్టి గలిగి। లేనివ్యామోహమెల్లఁ గల్పించుచుండు.
గీ. క్షితిని తామ్రము శుద్ధిని జెందునెడల। వరసువర్ణరూపమునందు ప్రతిభఁ గాంచుఁ
చిత్తమును బరిశుద్ధముఁ జేసి సకల। కల్మషంబులఁ దొలఁగింపఁ గలుగు ముక్తి. 377
గీ. తన్మారుహమునుండి పుష్పంబు సౌరభంబు। భిన్నములుగానిరీతి నీవిశ్వమంచుఁ
గర్తకర్మక్రియలు దైవ గర్భితములు;। లీలకై భిన్నగతుల నుల్లిఖితములగు.
గీ. పుష్పసౌరభములరీతిఁ బురుషకర్మ। ములకు లేదు భేదము జగమ్ములనుదలఁప,
సర్వమాపరమేశ్వర సంజనితము, । వచ్చినట్లుగ నీశ్వరోపాసనమున. 379
గీ. వ్యక్తులరిషట్కమునుజంపవచ్చు దీక్షిమ। మానసనిరోధమున, సర్వమార్గమగుట
దక్కనవియెవ్వియు మనసాధనకులోంగ। వవ్వి దేహసంబంధము లగుటఁ జేసి.
గీ. మనకుఁ జెడుగని నచ్చిన పనులమాన। వచ్చుఁ జిత్తమునరికట్ట భద్రమగును;
జేయఁదగినవి పట్టునఁ జేయవచ్చుఁ। చిత్తములయింప నిఁక నేమి సేయు నాత్మ!
గీ. మాయ నా బ్రహ్మ సృజియించి మమతనుబడి। చిత్తసంజాతమగుజీవసృష్టికిదిగి
దీనిభేదించుఁడని మనకానయిదుట । కంటె నజ్ఞానదశ యేమికలదు! జీవి! 382
గీ. మాయకే మనస్సనునామధేయమొసఁగి। నేమిలాభముపాధియయ్యెనదియపుడు
తనువుపోయిన పీడక తగులుకొనిన। జీవుఁడగు బ్రహ్మకే యదిశిక్షయగును.
గీ. విషయ భోగేచ్ఛయే మనోవృత్తికంకు। రంబు దానిఁ ఛేదింపసర్వమును బాయు;
నదియె సంసార విషవృక్షమగును ధరణి,। ఖేద మోదంబులెల్ల సంకీర్ణమగును.

గీ. పసిబిసుఁగువంటిదౌ మనోభావమెట్టులు। త్రిప్పినడిపింపనట్టులుగఁదిరుగుచుండు;
దుష్పథంబున నడిపింప దుష్టయగును, । సత్పథంబున నడిపింప సౌఖ్యమిడును.

గీ. స్వేప్సితత్యాగ శస్త్ర సహితుఁడగుచును । జిత్తవృక్షంబు భేదించుజీవి యప్పు
డైహికముగ జీవన్ముక్తుఁడై తరించు । వానికంటవు సంసార వాంఛలేవియు.

గీ. కాళికేశుణ ధర్మంబు గల యవిద్య । జ్ఞాన మజ్ఞానముగ,నంధకారమును బ్ర
కాశముగఁజూపఁగల శక్తికలిగియుండు, । గానఁ బరిమార్పవలె నెప్పుడానిజ్ఞాని.

చ. విషయ రథంబునెక్కిన యవిద్యయె జీవుని మోసపుచ్చుచున్
వృషభసమేంద్రియాశ్వముల రెచ్చఁగఁద్రోలి శరీరసమ్యగా
మిషమునుమెక్కి మానసము, మృత్యుముఖంబునఁ ద్రోయుఁగావునన్
విష మయమైన దీని నవనిన్ వశపర్చుట కష్టసాధ్యమౌ. ౩౪౪

గీ. భాస్కరోదయమున రాత్రిపరచునట్టులు । విద్యవలననుబోవునవిద్యయెట్లొ;
యిచ్ఛయేయవిద్యయగుమహేశ్వరాజ్ఞ,। దానివిడనాడమోక్షముదానఁగలుగు,

గీ. బుద్ధి విషయంబులందు సంబద్ధమైన । దాని నజ్ఞానమందురు, పూనినిశ్చ
లంబుగఁబరమాత్మనియందులగ్నమైన।నదియెపరమజీవన్ముక్తియందురెప్పుడు,

చ. వెలసెడి నిశ్చలస్థితిఁ బ్రవీణుఁడు ద్వైతమె దుర్భరంబుగాఁ

దలఁచిమె భ్రాంతిఁగూర్చుకొనఁ దాసృజియించెను లీలకై జగం
బుల; మనకట్టి నిశ్చలతపొందిన నేమిఫలించు! దైవసం
చలనమె జీవసంతతి కజస్రముఁ గల్గెను: నిగ్రహం బెటుల్. 391
గీ. కడుపునిండుగ నెత్తురు గుడిచిగాని । జలగ పట్టినపట్టును సడల నీదు ;
విషయకాంక్షలు జీవుని వెంటనంటి।విడువ వెన్నఁడు ప్రాణముల్ విడుచుదనుక.
గీ. కశలి నావర్తములు నౌక గతిని నడ్డు । పగిది జీవసాగరమున భ్రమల నేక
ములుగ సంసార నౌకను ముంచుచుండు,।జీవి యల్లాడుది గ్భ్రమఁ జెందినటులు.
గీ. అంగులీయకమగు హేమ మాత్మగతిని।మరచి దుఃఖించురీతిని, బరమపురుషుఁ
డిచట జీవాత్మయై భ్రమ నేద్చుచుండు,।మూఢ సంసారమునఁబడి ముక్తిఁగొలుకు.
గీ. శుక్తి రజితము, మృగతృష్ణ శుద్ధజలము।లేనిగతిఁ బరమాత్మలో లేదుసృష్టి ;
భావనామాత్రమగు భ్రమ వదలిపోవ।లేనిజిజ్ఞాస యంత ర్విలీనమగును. 395
గీ. ఇంద్రియసమూహము నిలజయించుటయను।నారథియె భవసాగరోత్తారకమగు
శాస్త్రసజ్జనసాంగత్యసాధనమెజి।తేంద్రియతఁగూర్చు,గర్మములెల్లమాయు 396
గీ. చిత్తమేపురుషుఁడతఁడు చిత్తునందుఁ।దేరిచూచిన సంసారబంధింపఁబడును ;
వృత్తులం ద్రెం.ప బంధముల్ వీడిపోవు,।మానసనిరోధమే మహామంత్రమండ్రు.
గీ. చిత్తమునశించినంతశుష్కించునింద్రియములు,సంతతానందసౌఖ్యములుపోవు
ఎలుకలనుజంపు తలఁపున గృహముఁగాల్చు।వీడిడియగుమనసుజంపుబుధుఁడవని.

గీ. లింగసూక్ష్మశరీరంబులేమనస్సు। వాసనలు వోవ్రుదనుక జీవమునువిడదు
దానిజంపిన జీవిచేతన మడంగు। బాలతోపాటు మోయంగ వలయురాయి.

గీ. తనుమనంబులు జడపదార్థములు రెండు। నంబుద తటాకములరీతి నతిశయించు
నిలఁబరస్పర సంబంధ కలనవలన। జననమాదిగ మరణంబు దనుకవిశక. 400

గీ. బంధమోక్షము లాత్మసంబంధగతులు। కావు కల్పితభ్రాంతివికారములగుఁ;
జిత్తవిభ్రాంతులగుట నశింపఁగలవు। వానినిలయంబు తనువు పోవంగఁదీరు.

గీ. జీవి కమనస్కసిద్ధి సంజీవియగును। జన్మ రాహిత్య మొనరించి తన్మయత్వ
సచ్చిదానందమునుగూర్చు, సకలములగు। బాహ్యఁదోలంచు నద్వైతపదముఁ జేర్చు.

గీ. వసుధ సర్వాభిలాషా నివర్తనమునఁ। జిత్తవిభ్రాంతి పూర్తిగ నార్తిగిలును;
రాజయోగమనఁబడు, కర్మఫలములును। వానికంటవు నిర్మోహపరుఁడగుటను.

గీ. మన మనశ్చాపలంబున జనితములగు। సృష్టిజాలంబుకల్గి నశించుఁగాన
సాధ్యములు సకలైశ్వర్యసంపదలును। మాయమగునవిప్రకృతిసంభవములగుట.

గీ. తైల మేపుష్పముల వాసితత్వ మొందు। నట్టిసౌరభమునుగాంచు నటులుమనసు
మనన మే వృత్తిఁగావించు ననవరతము। నట్టి విజ్ఞానమునె పొందు నవ్విధరీతి. 405

గీ. ఉపవనోప మాసంబగు వపువు జీవి। సౌఖ్యమందుట కేర్పడె ముఖ్యముగను

అట్టి జీవాలయంబు దురంతదురిత।ములకుఁ బాల్పడి దుఃఖంబుఁబొందు చుంద్రు.

చ. జగమున నాదిదంపతుల, సర్పము వైరముఁబూని మోసగిం
పఁగ జగదీశునాజ్ఞ నెడబాసిరి, పాపము కల్గెదాన నీ
నిగడిత సర్పమే మనసు, నిర్మల జీవుల రూపుమాపు నీ
పగతుని నిగ్రహించుటయె భక్తిగ బైబిలుసందుఁ గన్పడున్. 407

గీ. చిత్తసర్పంబు నెడబాసి జీవి క్రైస్తు।వోదిత జ్ఞానమును బొందియుండు నెడల
సంచితంబెల్ల భస్మమై సన్నిధాన।మబ్బి జీవి జీవన్ముక్తుఁడగు నిహమున. 408

గీ. మనసును వివేక జలమున మార్జనంబు।సేయఁ బరిశుద్ధమగు నాత్మసిద్ధికలుగు
మాయసైతాను కరతలామలక మగును। దైవ పుత్రిత్వసిద్ధి నద్వైతమగును.

గీ. మశకసంఘం బుదుంబర మధ్యమునను।గలుగురీతిని దుర్వృత్తిగణము చిత్త
మలమియుండఁ నువానిని మాడ్చివేయఁ।గఁ బరిశుద్ధాత్మ ప్రస్ఫుటోత్కర్ష వెలయు.

గీ. ఆశయను పాశమున బద్ధులైన వారు। రజ్జుబద్ధ పక్షివలె సంరంభ ముడిగి
కాలగతి నధఃపాతముఁ గందురెపుడొ। చిత్త విభ్రాంతితొలఁగిన సిద్ధిఁగంద్రు.

గీ. అవయవంబులవాడ మెదు వ్యాధులొకప।ధముల వారించునట్లింద్రియముల బొడము
నాధులెల్ల మనోనిగ్రహంబువలన।నుపశమించుకొనిన ముక్తిగొదవుఁగాదె!

గీ తగనహంకార మేఘావృతమగు నట్టి। జీవచైతన్యమున శాంతి చెలఁగ నెపుడు
స్వార్థనిర్మూలనము సేయు సర్వసాక్షి। ప్రతిభసాక్షాత్కరించుఁ దీవ్రముగ మదిని,

గీ. జలము జలమునఁ గలిసెడి చందమునను । జ్ఞానమొదవిననందహంకారదశలు
లీనమైపోవుఁ బరతత్త్వ లేశములవి । మాయయునుపీడుజ్ఞానసమ్మార్జనమున.

గీ. కలుగుసుఖదుఃఖములునహంకారవృత్తి।పరిణతులు,మనోహలముచేఁ బెరికివైవ
సంసృతి నశించు,జ్ఞానబీజము ఫలించుఁ।బూజ్యతరమైనమోక్షసామ్రాజ్యమొదవు.

గీ. ఆత్మ చిన్మయదర్పణం బమలమగుట । నుది నిరంతర చింతన మొదవె నేని
వైరిషట్కంబు,మానసవైభవంబు।మాయయునహంకృతియుమటుమాయములగు.

గీ. ద్రష్టృదర్శనదృశ్యముల్ త్యాజ్యములును।గ్రాహ్యముల నెడు భావతరంగ వితతు
లునుశమింపనహంకారముడుగునిలుచు । నిత్యసత్యాత్మ మనయందునిలకడగను.

గీ. వాయువునదీపమునశించుపగిది, నాత్మ।మననమునశత్రుషట్కముమాయమౌను
దాన నేకాగ్రచిత్తము తనరు, రాజ । యోగివగుచు జీవన్ముక్తి నొందవచ్చు

గీ. విషయభోగేచ్ఛయేబంధవిస్తృతంబు।దానిఁద్యజియించుటయెమోక్షదాయకంబు
సర్వమతసారమిందుఁబ్రశస్తిఁగాంచు।వాంఛనరకము,నిష్కామ్య పదముముక్తి.

గీ. కీర్ణకంటక బీజ విక్షిప్త భూమి । కంటకోత్పత్తి గలిగించు కరణి, ధరణి
దుష్టసంకల్పములఁదులఁదూఁగు నరుఁడు।దుష్ఫలంబుల నేకాంచి దుఃఖపడును.

గీ. జగతిఁ బ్రేమింప జగతియే సంభవమగుఁ।బరమపురుషునిఁ బ్రేమింపఁ బరమె కలుగు;

రెంటికిని సేవచేయు టరిష్టమనుచుఁ । గ్రీస్తునచియించె బోధన రీతి సవని. 421

గీ. శమదమాదిసాధనచతుష్టయముఁ కలుగ।విషయభోగేచ్ఛయంతయువిగతమగును
దానజగముబ్రహ్మంబనుతత్త్వమబ్బు,।నాహయినినహంబ్రహ్మస్మి యనిస్ఫురించు.

గీ. పానకంబున విత్తును నానఁబెట్టి । నాట నాచెట్టు మధురసోన్నత ఫలంబు
లిచ్చురీతిని జిత్తంబు నీశునందుఁ । జేర్పఁదత్కృపనైర్మల్యసిద్ధిఁగాంచు. 423

గీ. జీవమేరీతి దైవాంశచేఁ బొడముఁనో।తనువు నారీతిఁ బంచభూతములఁ బుట్టుఁ
గాన జీవముతోఁ పాటు గాత్రమునకు। భేదమగు, రెండు నీశ్వరోద్భిజ్యములగు.

గీ. మత్తుమందును బీల్చిన మాత్ర జీవి । వాసనాశూన్యుఁడై దేహబాధల విడు;
లింగదేహ మేమయ్యె? నసంగతంబు ; తనువు విడిచిన జీవి నెట్లనుసరించు ?

ఉ. మాయనుగూర్చి యీశ్వరుఁడు మాయకులోంగి జగంబులెల్ల నా
మాయను సృష్టిజేసి, మటుమాయము జేయుడు జీవులంటయున్
మాయయెగాడె చిత్తమను మర్మము ముందుఁబరాత్మ్ముఁబట్టె, న
న్యాయము జీవు లేసగిది నాత్మనుమించి చరించ సాధ్యమా. 426

గీ. ప్రకృతి సంధానమున నుండువాని కెపుడు ।నన్నపాన సంభోగ నిద్రాదితుచ్ఛ
విషయములెవుానను,దైవికోద్వేగముఁ మగు;।లౌకికముపీడఁగను బారలౌకికంబు.

గీ. ఆగ్రహమునకు వశుఁడైన యట్టివాఁడు।దాని కోపయితీయగు దేహతాపమెదుగు
నష్టమేగాని లాభమింతయును లేదు।తామసమునందురార్య్యులు తామసియని.

గీ. భోగములత్యాగమునజన్మపూజ్యమగును,।విడువకుండినదుఃఖము పెరుగుచుండు
సామరస్యంబు పొసఁగని సంకటమిది । పరమపదమార్గమీశ్వర భజనమరయ,
గీ. జగమున మనస్సు జీవియైజన్మమంది । పెరిగి విజ్ఞానదృష్టి సంవేద్య మగును
జీవియగు మనస్సునశింపఁజేయుటెట్టు। లాత్మహత్య యధర్మమటంౘ్రుబుధులు,
గీ. జీవియే మనస్సనియును జేతనమని।యొక్కయెడ జడమనుచు నింకొక్కయెడను
బల్కుటదిధర్మమగునెసంభవముకాదు; । జడముజీవము రెండునుభావవెప్పుడు.
ఉ. మానవుఁ డేపదార్థమున మక్కువ నెక్కుడు చిక్కఁబట్టునో
దానికె హానిగల్గు, నది తక్కిన మానవుఁడే హరించు, స
న్మానము చిక్కదైహిక మమంగళ మాటను; దైవచిత్త సం
ధానమె శాశ్వతప్రతిభ, దానిఁగొనందగుఁ జిత్తశుద్ధిచేన్. 4^2
గీ. కర్షకుఁడు భూమి దున్నినఁగాని పంట । పూర్తిగాఫలింపనిరీతి బుధుఁడు చిత్త
శుద్ధిగావించినను గాని శోభఁగనఁడు; । దైవమేపరిశుద్ధాత్మ, పావనుండు 433
గీ. కవచ ధారణచే బాణఘాత లుడుగు । నటులుచిత్తమున్నన్మార్గమందునడుప
దుష్టవిషయేచ్ఛలన్నియుఁదొలఁగిపోయి । కలుగునాత్మానుసంధానఘనసరీక్ష,
గీ. అప్రయోజనములు జగద్భాగ్యములు । వానిపైభ్రాంతివిడిచినవాఁడెముక్తుఁ

జాశయున్నంతపఱకు వినాశనంబె । కలుగుచుండును జ్ఞానవిఘాతమునను. 435

మ. అనుకూలార్థమునందు నిచ్చఁ, బ్రతికూలార్థంబునన్ ద్వేషమున్,
మనమందుం డెడునంతకాలమును నిర్మాణిన్యమెట్లొను ? పా
వన జీవంబె పరాత్మచెంతఁజన నోపంజాలు ; శుద్ధాత్ముఁడై
నను ముక్తుండగు నీవనాడ నెటనైనన్ భీతిలే దింతయున్. 436

గీ. తృష్ణయనుపాముమానసేంద్రియబిలంబు।నందునునుడాగిరుధిర మాంసాస్థితతుల
నెల్ల భక్షించుచుండెనహీనముగను।దానిఁద్రోలఁగించు నెడలస్వాస్థ్యములభించు.

గీ. ఇంధనము చేత ననలంబు హెచ్చునటులు । విషయు చింతనచేఁ జింత వృద్ధినందు
నింధన రహిత వహ్ని నశించునైవ । చింతనము చేయుసంసార చింతయుడుగు.

గీ. తృష్ణయను నులూకము చెలరేగి చిత్త।మందు విక్షోభ మొనరింప నందువలన
నీకశుభములు గల్గును నిశ్చయముగ । నట్టియూహల వారింపనగుశుభంబు.

గీ. ఆత్మయనురాజునకుమంత్రియగుమనస్సు।మంత్రియే చేయుసర్వనిమంత్రణముల
స్వస్థచిత్తుఁడై రాజనిశంబు నిర్మ।లముగనుండును మంత్రిపాలనమె వెలయు.

గీ. రాజదర్శనమున మంత్రి లభ్యుఁడగును । మంత్రిచిక్కిన రాజ సమక్షమబ్బు
నీసమస్యను సాధించుటే విషయము।చిత్తనాశనమున నాత్మ చిక్కుటెట్లు ?

గీ. ఆత్మసందర్శనము మంత్రి మూర్జఁగలుగు। మనసునరికట్టి వేధించి మలఫుకొనుము
 మంత్రిచిక్కనఁ బ్రభుని సన్మానమొదవుఁ। గాకయుంశిన సాధ్యముకాదుముక్తి.
గీ విషయభోగేచ్ఛపూర్తిగా విడువనేడేల। మానసముశూన్యమగుచుస్వాధీనమగును
 నైహికాపేక్షలెల్ల మాయుంబు గాఁగ। బిదప నిరతిశయానంద పదవిగల్గు. 443
గీ. ఇంద్రియంబుల చేత గ్రహింపఁబడెడు। సకలమును గన మానసోత్సాహము గుట
 నస్థిరంబని తెలియంగనగు ధరిత్రి। వానిఁ బ్రేమింప శోక ముత్పన్నమగును.
గీ. మానసేంద్రియ కల్పనా సహిత సృష్టి। వ్యర్థమని విశ్వసించి విశ్వాత్మనేనె
యనుచు నమ్మినజీవుఁడే యనఘుఁడవని। దాని గ్రహియించి ముక్తిపదంబుఁ గనుము.
క. విషయాసక్తుల చిత్తము। విషయంబులయందె చిక్కి ప్రీతిని భగవ
 ద్విషయమె తలపోయక దు। ర్విషమునమృతినందు నాత్మవిదుఁడౌ నెటులన్.
గీ. మానస వికారములు దైవమాయలెల్ల। నీశ్వర విభూతులట్టివే విశ్వసింపఁ
 దగదు, వడఁద్రోయుటకు దీక్షలగు ధరిత్రి। సర్వసంగపరిత్యాగ మూర్వ మేలు.
గీ. ఇంద్రియంబులు చెలరేగు నెపల బాధ। నంబగు నవియు లోననణంగియున్న
 నదియె మోక్షంబు; లీలామయంబు జగము। దృశ్యమానిజగంబెల్ల నశ్యమగును.
గీ. తంతువుల బూత స్వహృదయాంతరమునుండి। తీసి చిక్కంబువల్లు రీతిని మనస్సు

వృత్తులను వెలిబుచ్చి యీసృష్టిసలిపె। స్వీయకావ్యముఁగాంచుఁ బ్రాచీనముగను.

గీ. సాత్వికము రాజసము తామసంబున నెడు। మానసిక గుణములను సమంజసముగ
వశ్యమొనరించుకొను వాఁడె ప్రతిభఁగాంచి । జీవయాత్రనుగడపు నిశ్చింతతోడ.

గీ. సాత్వికం బాత్మజన్యంబు సఫలమగును। రాజసముభోగరక్తికర్మములఁగూర్చుఁ
దామసం బంధకార మధర్మమగును । సాత్వికంబే తగును మోక్షసాధనమున.

గీ. ఆజ్యమునఁ దృప్తినందని యగ్నిపగిదిఁ । బృథ్విఁగామోపభోగ సంప్రీతుఁడైన
మానవుఁడుతృప్తిఁగాంచక జ్ఞానియగును;। ముక్తికర్హుఁడుగాడువిమూఢుఁడగుట.

గీ. జీవులందఱుఁ బరమాత్మ క్షేత్రములను । జ్ఞానముండిననాట్యారంజన మెపోవుఁ
గానఁదెలియక భ్రమపడి కస్తిఁజెందు । దీనినే మాయయందు రేధాత్రీతలమున.

గీ. దైవమేకాకిగానుండి తనివిఁగనక । మాయఁగల్పించె దాని దుర్మదవిలాస
నటన మీసృష్టి; శక్తిసంకట మనంత । చింతలకుమూలమాత్మయె చెందు సేగి.

మ. భగవంతుండు సమస్తసృష్టి నిజభావస్ఫూర్తిఁ గావించి యీ
జగతిన్ జీవులె సృష్టిఁజేయఁగల స్వేచ్ఛంగూర్చె నట్లౌట నై
జగతిన్ సాగుచునుండె దానికది ప్రాజాపత్యముం గోరకే
పుగ సృష్టిస్థితి నాశముల్ ప్రకృతికిన్ భోగంబులై సర్వదా ।



శ్లో. 'ఉపశాంతేహి సంకల్పే ఉపశాంతమిదం భవేత్

సంసారదుఃఖమఖిలం మూలాదపిమహాత్మనే" (జ్ఞానవాసిష్ఠము) 456

గీ. నించుసంకల్పమెల్ల నశించునపుడె । యీసమస్త జగంబు శమించుఁదలఁపు
దొలఁగుకతన నీసంసారదుఃఖమెల్ల। నెంతయు సమూలముగ నశియించునిజము. 457

గీ. ప్రకృతియే సృష్టినంతను బరపుచుండుఁ । బురుషవీక్షణ దానిపైఁబడ నటందు
రట్టులాడుది సంసృతి నెట్టఁగలదు । స్త్రీపురుషభేద మిట్టిది జీవులందు. 458

గీ. ధరణి సంకల్పరహిత చేతనమె యాత్మ । యద్వితీయంబునైన-చో నాదిసృష్టి
యెటులుప్రభవించు? భావన యెటులు గలుగు?। ప్రకృతిసృష్టించిపిష్టిం పవలనుపడునె.

మ. చిరకాలంబుగ దేశయాత్రల మహిన్ సేవించి స్వస్థానముం
దిరుగంజేరిన యాత్మబంధువును గుర్తింపంగ లేనట్లు సు
స్థిరతన్ హృద్గతమై వసించు మనయాత్మీయంపుఁ జైతన్యముం
బరికింపంబడదయ్యె నిర్మలమనో భావంబు లేకుండుటన్. 46)

గీ. హృదయమునను్న పరమేశు నెఱుగునెడల। వైరిషట్కంబుతమయంత బాఱిపోవు;
సచ్చిదానంద పదవి వశ్యమగు మనకు । నట్టిస్థితియె జీవన్ముక్తి యనగఁజెల్లు.

గీ. సూర్యుడుదయింపఁగనుజారచోరులెటకొ। వడిఁబలాయనమొనరించుపగిది నాత్మ
ప్రజ్వలింప సహంకార వర్గమెల్ల । మాయమౌఁగూడిపసిమఱుమాయమగును.

గీ. ప్రబల వర్షంబుచే దావవహ్ని యడఁగి। చల్లఁబడు పర్వతమువలె నుల్లమలరఁ
దృష్ణ మొదలగు నింద్రియ దీప్తులుడుగ। జీవుఁ డానందమయుఁడయి చెలగుఁగాదె!
గీ. ధరణి క్షీరోదకన్యాయ దశలభించు । జీవపరమేశ్వరైక్య సంభావనమున
జన్మచే నిట్టిద్వ్యర్థి సంజనిత మయ్యె । వ్యావహారికమగుట సత్యంబుకాదు.
గీ. సురతము నభిలషించెడి సుదతి విభుని। నిద్రయందున్న మేల్కొల్పి నెరపునటులు
నిర్వికల్పసమాధి నందిన పురుషుని । శక్తి ప్రేరేచు సృష్టి కీశ్వరుని సుప్తు.
గీ. సూర్యకిరణ ప్రసారముం జూడలేని । గుడ్లగూబలవలె నెల్ల కూరిరజనులఁ
దైవ పరిశుద్ధ కాంతికిఁ దాళలేక । మారుమూలల నుందురు మాయనొదిగి.
గీ. ధరమనోవ్యాధి కితరౌషధములు లేవు । స్వీయశక్తినివశముగావింపవలయు ;
నింద్రియవ్యాపృతులనుజయించినపుడె। ముక్తిపథమునమిగులఁ బ్రాముఖ్యముగను.
గీ, దైవతుల్యమౌ పారిశుధ్యంబుఁగనక । దైవసాన్నిధ్యమును జేరఁ దరముగాద
టంచుఁగీర్తిస్తువచించెఁ దదర్థమేమి ? । మానసేంద్రియనిగ్రహమానుటయగు.
గీ. జీవి చిత్తాక్రమణమాత్ర సిద్ధివలన ।ధరణి సంసార రోగౌషధమును బడయు
వర్తమానమునఁగలుగువానిగుఱిచి । ముందువెనుకలఁజూడకపోలుపుఁగనుము.
గీ. జలదమున్నంతవఱకువర్షమ్ముగురియుఁ । చిత్తమున్నంతవఱకుసంసృతియునుగదు
కల్పనారూపమాలిన్యఘటనకదియె । ముఖ్యకారణముగునుబ్రమూఢునకును.
గీ. చంద్రకిరణము లుండిన జగతి మంచు।గుఱిసెనోతీరుఁ చిత్తముఁగూడనాత్మ

చంచలము గాక మానదు ; సౌఖ్యములకును। జిత్తరహితచేతన మె ప్రసిద్ధతపము.

గీ. మనసముసుఖాలు మానవమానసమున। నాశలను బాయసావళి యలమియుండు
నదియె సుఖదుఃఖములఁ గూర్చునట్టిదగును। మానసనిరోధమే ముఖ్యమంత్రమండ్రు.

గీ. ప్రాప్తములుగాని వానికై పలువరింప। కయెనివృత్తినిమదిఁ గాంచఁగలుగు నెడలఁ
గ్రమముగాఁ జిత్తవృత్తు లాకాంక్షలుడిగి। పండుటాకులవలె రాలిపడును మదిని.

గీ. కమల పత్రిముపై జల కణము పడిన। దానినంటక నిర్మలోదార గతిని
నిలుచు రీతిని జగమున నిలిచి జీవి। దాని కంటక బ్రతుకును దనుపవలయు.

గీ. చిత్త విక్షోభముడిపిన జీవి మంద। రాచలము లేని క్షీరాబ్ధియట్టులు ధరణి
నిర్మలిన వర్తనుండయి కర్మములను। దగులుకొనక యె తనజీవితమును గడపు.

క. అంతమునం దెప్పుడు ఘన। చింతలఁ గలిగించునట్టి చిత్తవికాసం
బంతయు నుడిపిన నాత్మో। దంతము ప్రత్యక్షమౌ సుధామయ మగుచున్.

గీ. చిత్తమండూకమా! నీవు సృష్టినెల్లఁ। దిరిగి ఘోషించి ఫలమేమి తెచ్చినావు?
దుఃఖ సంపాదనమె నీవిదూషకత్వ। ఫలము; శాంతింపుమింతతో నిలిచిపొమ్ము.

గీ. ఉద్ధతులమధ్య పేదల కుండఁదర మె। యనెడునార్యోక్తియిచట సత్యమగుఁగాదె
తనుమనంబులుపోరు సందర్భమునను। జీవి హింసింపఁబడుచుండె సృష్టియందు.

గీ. శాలుఁడు పిశాచమును బోలె వ్యర్థమగును! దేహమును బరికల్పించితినుచు స్వీయ
దుస్స్వభావమునను ముప్పిదుఃఖపెట్టుఁ, । బచ్చుపఱకు విడువని పిశాచమగును.

గీ. చిత్తమున సహంభావము చేరియుండు । నది, యసత్యయ్యసత్తుగా నగపడుటను
జీవికను భవములగు దచ్చేష్టలెల్లఁ । జిత్తవిలయంబునన కార్యసిద్ధి కలుగు. 480

ఉ. మానసమే గదా ! ఋషుల మంజులవాక్కులు వేదశాస్త్రముల్
పూని పఠించి జ్ఞానపరిపూర్తిని గూర్చెడి యంత్రరాజమ
ద్దాని వధింప వెత్తిపని, తత్త్వవిమర్శను సామవేదమున్
గానము సేయు సాధనయె నాశనమౌ నుపపాదనంబగున్. 481

గీ. జీవునకు మనస్సే గద ! నావ, కీడు । మేలులను జూప ? దాని శమింపఁ జేయ
నంధ తమసంబునం బడు పాంథునటులు । దారి తెలియక దుఃఖముల్ దాపరించు.

గీ. నరునకును జంతువితతికి నడుమ గలుగు । తారతమ్యము బుద్ధి నిదానమెకద !
దానిఁ బరిమార్ప మృగతుల్యమానుగాదె!! పశుసమానము చేయు తత్త్వమది తగునె ?

గీ. బుద్ధిలేని వాండ్రిల వెఱ్ఱిపోకడలను । సంఘమర్యాదలకు హాని సలుపుచుండ్రు
వాని నరికట్టు బుద్ధి పోవంగ బ్రతుకు । వ్యర్థమగు నిది వేదాంత ఫలితమగునె ?

ఉ. మానస హత్యచేఁ బశుసమానుఁడుగా మనియుంటకంటె, స్వా
ధీనము తప్పి సంఘ నియతిం జెడఁగొట్టుటకంటె, మృత్యు సం
ధానము వాళ్లించి తఱగితంబుగ దేహము విడిపోనగు

జ్ఞానముఁగల్గినందులకు సభ్యముగుం బరమేశ్వరార్పణన్. 485

ఉ. పీవనఁద్రిప్పినం గదలి పీచెడి నిశ్చలవాయు వట్టుగా
జీవి మనస్సు నిర్మలతఁజెందియు వృత్తులు సంచలింపఁగా
భావనగూడి కర్మముల వాంఛల దొర్లు, వివేక హీనుఁడౌఁ
గావునఁ జిత్తవృత్తుల ప్రగల్భములన్ బిగబట్టఁగాఁ వగున్. 486

గీ. ఘోటకంబును వాగెయుఁ, గ్రూరదంతి । నంకుశంబును వలెనింద్రియములమనసు
నుచితవర్తనమునఁ ద్రిప్పనోపు నెప్పు । డల వసంతము భానుని నుటులుధరణి.

గీ. అశన నిగ్రహమునఁ జిత్త వశతగలుగు । నింద్రియంబులునిఁ చుస్వాధీనదశను;
దేహ ధారణకుం దగు తిండిచాలు । తపమనంబడునిదియె సద్ధర్మమరయ. 488

క. గుణములు మాయకు నొడలని । గనుంగొనుచువానిఁ నణఁచఁగలవాఁడుజయిం
చును మాయ నటులుగాకుం । డిన సంసృతి నోటఁజిక్కి డిందుం గాదే! 489

గీ. మనసు సంసృతిఁగలిగించు ననుటతగదు । మతిచెడినవానికగపడమానుజగము
సృష్టిబరికించు యంత్ర మీచేతమరయ । దానిఁజంపిన మాయదీ దైవసటన.

గీ పిచ్చివానికి లేకపోవచ్చుఁగాని । సంసృతియె పోవుననుట యసంభవంబు;
మతిఁజెరుపుకొన్న వాఁడు దుర్మార్గుఁడగును, । సాధువర్తన మేరీతి సంఘటించు?

గీ. ఈశ్వర పరికల్పితసృష్టి యీశ్వరుఁడగుఁ।గాక యన్యపదార్థంబు కాఁగలదెటు?
బ్రహ్మమే విశ్వమని శ్రుతి పలుకుచుండె,।లీలయేగాక మాయయేలీలనతుకు?

క. శంకర మతమున మాయ న । లంకారమ్ముగ సమర్ప లాఘవ ముడిగెన్
లంకెలు చెల్లవు గానఁగ । శంకము ప్రసరించెఁ జిద్విలాసంబునకున్. 493

క. స్వాజ్ఞానంబున బ్రహ్మమె । ప్రజ్ఞను గోల్పోయి మాయఁబడె ననఁదగునే?
విజ్ఞానమున కవిద్య య । వజ్ఞత గలిగింపఁదగు నుపాదేయంబే ? 494

క. ఉన్మాదము తలకెక్కిన । జన్మము సంసృతియెగాదు సకలముఁ జెడు జీ
వన్ముక్తతయన ధరనే । తన్మాత్రమెయైనఁ గోరఁదగ దెవ్వనికిన్. 495

గీ. మూగియున్నట్టిశైవాలమునుదొలంప।మడుగునన్ శుద్ధజలముసంప్రాప్తమగును,
మాయనారీతిఁద్రోయబ్రహ్మముఁలభించు।ననినమాయయుబ్రహ్మమేయగునుగాదె!

గీ. చిత్తమునుబ్రహ్మమును వేఱుచేయునెడల।ద్వైతముత్పన్నమగు, నేకతత్త్వమనిన
దద్వినాశన మెటులు సాధ్యమగుమనకుఁ।జిత్తజీవాత్మలద్వైతవృత్తులేకద! 497

గీ. ఏరికి నసాధ్యమగుచిత్తహింససేయు । మనుటకంటెను, జచ్చిపొమ్మనుట మేలు
చచ్చినను వీడనట్టివాసనలఁగూర్చి । ప్రాస్వముగఁజేసిరిలజీవితాశయముల.498

క. మనుజున కైదింద్రియములు । మనంబు సమకూర్చు తగిన మనుగడ జన్మం
బున వానిఁజంపుట సిలుగు । లనేకములు కల్గు నది యనర్థంబెపుడున్. 499

ఉ. దైవమొ; మాయయో, తగువిధంబున సృష్టిని జేయునప్డదే

భావనచేసి మానసముఁ బ్రాణము, దేహముఁ గూర్చి; వానిలో
నేవిధి నొక్కయంగము మహిన్విడదీసిన సర్వనాశనం
బై వృథయౌను జీవిత నియామక ధర్మము చిత్తహత్యచేన్. 500

గీ. మానవునిబంధమోక్షసంరంభమునకు।మనమెకటిముఖ్యకారణంబనెను శ్రుతియు
దానిశిక్షించిమోక్షసాధనమొనర్పఁ।దగును,హింసింపనాశనమగునుగాదె! 501

గీ. సృష్టి సంసారమును బరమేశ్వరుండు । శాశ్వతంబుగ విడువక నలుపుచుండి,
జీవులనుసంసృతినిమాపుచేయుమనునె!।దానసృష్టియే పరిసమాప్తమగుఁగాదె!

వ. ఈసందర్భమున- "బుద్ధిజాడ్య జనితోన్మాదులగ్గదా శ్రోత్రియుల్"
అను అల్లసానిపెద్దనార్యుని వాక్యము సంస్మరణీయము. 503

చ. ఎవని మనఃప్రవృత్తులు నయించిన రీతిని వారు సృష్టులన్
భువి సమకూర్చుచో మనకపూర్వములై కనుపింపకుండునే!
భువనమునందుఁ గల్గినవి పోల్పుగ నెల్లర కేకరీతి సం
భవమెటులౌను! దృశ్యమునఁ బద్మము పద్మమె చూచువారికిన్. 504

గీ. అవని శృంగారరస సమగ్రానుభూతి। కలుగు నేజంటకైన సౌఖ్యప్రవృత్తి;
రూపరేఖలు చిత్త నిరోధకములు । మనసు సరిపెట్టుకొనినఁ బ్రమాదముడుగు.

ఉ. మాయయె సృష్టిసేయుననుమాట యథార్థమెయైన దారుణా
న్యాయము గాదె ! బ్రహ్మ వినయంబు నయంబు భయంబుతోడ నీ
కాయములందుఁజేరి కడగండ్లను జెందఁగ దాని మారణో
పాయము జీవులెట్లు గనువారలు మాతృ విదారణంబగున్. 5~6

క. మనచిత్తం బొక యదనున। ననేక విషయంబులందు నతుకదు గానం
గన వినఁ దిన ననఁ గొనఁ జన। మనంబు నొక్కొకటిగ గరిమ న్నెరవేర్చున్.

చ. మతిచెడి బుద్ధిహీనుఁడయి మర్గి నశించుటకంటె లబ్ధ జీ
వితము పరోపకార పరివీతముగా నొనరించు జన్మమే
ధృతిఁగృతకృత్యమౌనని నుతింపఁగ నోపుఁ బరాత్పరుం డనా
రతము సమస్తజీవ పరిరక్షణ తత్పరుఁడై మెలంగఁడే. 508

గీ. చిత్తము నశింపఁజేసిన సిద్ధునకును। ధరణి నున్మత్తునకువలెఁ దగులు మరపు;
వాని కే మిథ్యయనిపించుఁగాని జగము। జగము గానుండు జ్ఞానియేయగును మిథ్య.

గీ. చిత్తవిచ్ఛేదమున దేశసేవఁ జేయ। ననువుపడ దట్టిజ్ఞానంబె యంతరించు ;
వ్యర్థజీవనమగుఁ బరమార్థముడుగు। బనికిమాలిన కీటకంబయగు జీవి. 510

గీ. గోవుతోడను బెరిగెడు కొమ్ములట్లు। నరునితోడను బెరుగుదుర్తృష్ణయును ధరణిఁ
బరమవైరాగ్యమునను నివర్తితమగు। దాని వారించుటకు వేఱుదారిలేదు. 511

క. కదలీ గర్భాసారము। గద సంసారంబు దాని గమనింపనివో

మది॰గలం॰తెం॰జెంది యుత్తమ । పదంబుం॰జెందుట కపార బాధా కరమా. 512

క. ఉదకంబున మత్స్యంబులు । నుదుంబరంబున మశకములుండు విధమునన్
హృదయంబున దుర్వృత్తులు । వదలక పొడసూపి జీవుం॰బతితుం జేయున్. 513

గీ. ఘటజలంబుల ఘటము విఘటనమైన । రెండుం॰జెడిపోవునట్లు శరీర మాన
సముల రెంటిలో దేహవాసననశించె । నేని, రెంటును జెడిపోవు నిశ్చయంబు. 514

## పర్యాయపదములు.

గీ. ఆతివాహిక దేహ రూపాత్మమైన । బ్రహ్మమే మనస్సది యాతిభౌతికముగు
సృష్టిగావించుచుం జెను; చిత్త బంధ । మల మవిద్య, మానసమన మాఱుపేర్లు 515

గీ. ధరణి నజ్ఞాన మలిన చేతనమె ప్రకృతి, । మననమునకర్హమగుట చేమనసుననిరి,
కర్మమనికర్మేంద్రియగ్రంధియగుట । మాయయునహంకృతియును నామములుగలవు

గీ. ప్రకృతిపురుషుడు శూన్యంబు బ్రహ్మమాయ । శివుడు విజ్ఞానమీశానుడవుపరాత్మ
యనుచు వివిధ మతస్థులు నవెద రీసు; । ననివసిష్ఠుడు రామచంద్రునకుం జెప్పె.

గీ. క్షైత్రవిదీశ్వరుఁడాత్మ చైతన్యజీవ। పరపరబ్రహ్మ మనునాఖ్య వాచకములు
సృష్టికర్తకు వాఁడితి విఁందుఁడుల్యా। ములుఁగఁ బాలకులారీతిఁ దలఁప వలయు.
శ్లో. సంకల్పోహిమనోజీవశ్చిత్తంబుద్ధిస్సవాసనా
నామ్నైకాన్యత్వమేతేషాంసార్థేనార్థవిదాంవర (జ్ఞానవాసిష్ఠము.) 519
గీ. తలఁపె మనసు జీవుండుఁ జిత్తమును వాస। నాసహితమగుబుద్ధియు నాసినగును
నామమాత్రము వీనియందలి విభేద। మంతియే కాని కాదు యదార్థమరయ.
శ్లో. మనోహి జగతాంకర్తృ మనోహి పురుషః పరః
మనఃకృతం కృతంలోకే నశరీరకృతం కృతమ్. (యోగవాసిష్ఠము) 521
గీ. జగములన్నిటిసృష్టించుఁదగమనస్సు। పరమపురుషుఁడును మనస్సుబ్రహ్మమదియె
లోకపరివర్తన మనోవిలోకనంబు। భౌతికతనువు చేయ దేపనినిగాని. 522
ఆ. పురుషుఁ డీశ్వరుండు భూతాత్మకుండు జీవుండు ప్రాణుఁడక్షయుండు సత్త్వ
మనఁగ నేడు పేరు లష్టమంబు ప్రజాప। తిమనఁబరగు దండదేవు పేరు. (భార)
శ్లో. చిదేవదేహోప్యసవశ్చిదేవ। మనశ్చిదేవాపి చ ధీశ్చిదేవ
చిదేవకర్తాచచిదేవభోక్తా। చిదేవభోగ్యంచచిదేవసర్వమ్ (శంకరుఁడు.) 524
క. చిత్తేమనస్సు దేహము। చిత్తేప్రాణములు మఱియుఁ జిత్తేధీయుం
జిత్తేభోక్తయుఁ గర్తయుఁ। జిత్తేభోగ్య మఖిలంబుఁ జిత్తేయసనా. 525
శ్లో. శ్రుణుష్వవిద్వన్ మనఏవజీవో। మనోహివిశ్వంమనఏవచేశః

మనోహిమాయామనఏవబంధోమనోలయోముక్తిరయంయథార్థః (శంకరుఁడు)

గీ. బ్రహ్మ మీమాయ,మనసుజీవంబు,మఱియు।నీశ్వరుండును,బంధంబు,విశ్వమనుచు,
శంకరుఁడుచెప్పి మనసునుజంపుమనుట।యాత్మహత్యయు,బ్రహ్మహత్యయునుగాదె!

# తిర్యక్కులు.

ఉ. జీవులఁ జేసి కర్మఫలసిద్ధిని వారలె పొందునట్లుగా
దైవము సృష్టి జేసిన స్వతంత్రత నీవలెఁ జేయ మానఁ ; దా
నేవిధి స్వేచ్ఛ జంతుతతికిచ్చెను? మానవు స్వేచ్ఛ కేగతిం
దావగు దేశకాల పరతంత్రములొంగద! యెల్లకర్మముల్. 528

గీ. మానవున కొక్కనికి మాత్రమా యనంత । కర్మకర్తృత్వసిద్ధి ప్రకల్పనములు
జీవకోటికి లేని విశేషవిధులు । బరపునే; నరులకుఁబక్షపాత మగును. 529

గీ పాపపుణ్య వివేచనా పటిమ మాన।వులకుఁగలదన్న నితర జీవులకు లేదు;
వానికేగతి జన్మకర్మానుభవము ।లొప్పు? సమ్మేళన మతుకదో సుబుద్ధి! 530

గీ. జంతుతతికున్న విజ్ఞాన మెంత నమో। నిర్ధరింపఁగ మనకేమి నేర్పుగలదు
నరుల మించిన జ్ఞానమువరలునేమొ। మన మెయపమార్గవర్తనమునఘనులము.

గీ. చెదలుఁజీమలు పక్షులు మొదలుగాఁగ। జీవజాతుల నియమ విశేషములను
దరచి చూచిన మనుజులు తలలవంప। వలెను నైష్ఠిక ధర్మ ప్రవర్తనముల.

చ. జగతిని జీవజాతముల సాంఘిక నైతిక సాంప్రదాయ ధ
ర్మగతుల నెంచ నాగరక రాజ్య విధానములన్ హసించెడిన్
మగటిమి దూరదృష్టి నణుమాత్రము జంకవు, యుద్ధ కౌశలం
బగణిత, మింక మానవుఁ డహంకృతిఁ జెందఁగ నేల భూస్థలిన్. 534

గీ. జంతువుల కొకవిధమగు జ్ఞానముండు। జేయఁగూడని పనులను జేయ వెపుడు
మనమె బుద్ధిమంతులమని తనికి రాని। పనులఁ జేయుచు నుందుము భావ్యముగను.

గీ. హద్దుమీఱిన జంతువు లసలు లేవు। తమనియతులను పాలించి తనరుచుండు
హద్దుమీఱిని మానవు లరిది భువిని। గాననే పాపపుణ్య విఘాత మమరె. 535

మ. మానవజాతికంటె సుగమంబులు తక్కిన జీవజాతముల్
పూని సమస్త ధర్మగతులున్ వెలుఁగొందు స్వభావ సిద్ధమై
జ్ఞాన వివేక సాధన విచారణ యక్కఱలేదు మానస
ధ్యాన తపోవిరాగ పరతంత్రితలెల్ల మొలక్కియాఁగదా। 536

గీ. పావురంబుల నెచటికిఁ బంపి విడిన। స్వస్థలంబున కరుదెంచు సరణి, సకల

జీవు లెచ్చటఁబుట్టి వసించి చనిన । దైవమున లీనమగుట సార్థకముగాదె! 537
గీ. జంతు తతినుండి మానవజాతి వొడమె।ననెడిపాశ్చాత్యసిద్ధాంత మనుచితంబు;
ఘనవిజాతీయ జన్మసంఘటన మెపుడు । సృష్టి నెవ్వరువినికని లేదు ధ్రువము. 538
క. జివిఁబట్టులఁజూడుఁడు, వి । త్తవు, కోయవు, కొట్లలోన ధాన్యంబును నిం
పవు గద; లోకాంతరమం । దవు తండ్రియె యేలుచుండు నారసి వానిన్. 539
క. మీరెంచ వానికంటెన్ । మీఱిన వారగుదురుగద! మీలో నెవఁడే
నారసి తనయాన్నత్యము ।మూరెం డధికంబుసేయఁ బోలు నె కృషిచేన్. 540
గీ. అల జగద్రక్షకుం డేసుపలికినట్టు । లెల్లవారల మనసు రంజిల్లు నటుల
కాసునకునమ్మఁబడుఁజటకములు రెండు;।ఇలనుబడదొక్కటియుఁదండ్రి సెలవు లేక.
క. మీతలపైఁగల కచసం । ఘాతము లెక్కింపఁబడియెఁ గావున మీరల్
భీతిలకుండుఁడ నేకము । లైతగు పిచ్చుకలకంటె నధిలుకుగారే ! 542
గీ. సకలజీవులు భగవదంశభవులగుటఁ।జిత్తమేకాగ్ర మొనరింప నుత్తములగు
సప్తసిద్ధులఁగలుగు ధన్యాత్ములకును; । మానవేతర జీవులఁగానమివియు. 543
గీ. స్వేద వాయుజ క్రిమికుల వితతి ధరణి।నగణితంబుగఁ బుట్టి లయంబునందు
నిట్టి జీవులఁబుట్టింప నీశ్వరునకుఁ।గలుగు ఫలమేమియో చెప్ప నలవిగాదు.

గీ. క్రైస్తవుల పంథయేకాంత గణ్యమగును। మానవేతర జీవుల మసలదాత్మ
పాపపుణ్యంబులును లేవువానికిలను । నరులకే నిల్చి దైహిక న్యాయవిధులు.

క. కొట్టెదరన్నను భయమును । బెట్టెదరన్నను నయంబు నిజసంతతిపైఁ
బుట్టెడు ప్రేమయు జీవుల । సట్టుననును సమాన ధర్మవర్తనలౌఁగా? 546

గీ. మానవేతర జీవు ల నూనములగు । మానవుల సంఖ్యతోఁబోల్ప జ్ఞానమదన
మైన దైవదృష్టిని భేదమమర దెల్ల । జీవులును ముక్తి నెట్టులో చెందవలయు

ఉ. చిత్రము జంతువుల్ విధినిషేధము నెంచవు, ధర్మశాస్త్ర తా
పత్రయ శిక్షణల్ గనవు, స్వాదుపదార్థము లారగించుచున్
మిత్రకళత్ర శత్రు సరణిం బరికింపక, జీవయాత్ర సు
క్షేత్రములం బరామరికఁ జెంది తరించు, నదేఘనంబగున్. 548

## జాగ్రత్స్వప్న సుషుప్తులు.

గీ. స్వప్నగతమగు చర్య యేచందమగునో । జాగరిత మట్టులే జీవజాతమునకు
జీవులనచాయలాచిదచిత్స్వరూపు। కును,స్వాతంత్ర్యముండదెన్నఁడుధరిత్రి. 549

గీ. స్వప్నముసుషుప్తిలీనమైన మయ్యునట్లు। జగము ప్రళయంబునందునపగతమగును;

మిగులుపరమాత్మస్వీయనిర్మితముమాయ;కటకహేమాకృతినిష్పత్తికలుగుచుండు.

గీ. స్వప్నరహిత సుషుప్తి నెసఁగుమనస్సు । సగిదినుండును బ్రళయాంతవాసియైన
వరపరబ్రహ్మమునవచ్చుభవ్యమూర్తి; ఘనసమాధియందాస్థితికలుగనోపు.551

గీ. వేద్య వేదన వేత్తృత్వ వివిధవృత్తు । లెంపుఁ బ్రతిబింబితంబులై యెసఁగు నట్టి
దర్పణంబనిపరమాత్మఁదలఁపవచ్చు;నన్నియును వానిస్వప్నంబులగుటచేత.552

గీ. జీవునకు స్వప్న మీరీతి సిద్ధమగునో । దైవమునకల్లె సృష్టి సంధానమగును;
బంచతన్మాత్రలునుజగత్పరిణతియును।బరమపురుషునిస్వప్న సంభవములగును.

గీ. జీవు లగ్నిస్ఫులింగముల్ చెదరివచ్చి । భౌతికోపాధులను జేరి వదలిపోవు
స్వప్నమున నిజమృతిఁగని వగచునట్లు । స్వీయసంసారవిభ్రాంతిజీవివగచు 554

గీ. అకృత మననుభూత మసత్యమైనసృష్టి। స్వప్నగత చర్యవంటిదై సత్యముగను
దోఁచుటయెచిద్విలాసమైనుష్యమగును। స్వప్నజాగ్రత్సుషుప్తులీశ్వరునిమహిమ.

గీ. జీవునికి గర్భగృహమగు చిత్తమందుఁ।గల్పనంబగును జగద్వికార సమితి
స్వప్నకల్పనమువలె నసత్యములగు।బహుళసుఖదుఃఖచయములాభాసములగు.

గీ. స్వప్నసంభోగమున వీర్యపతన మట్టులు।జీవికిని లేనిసుఖదుఃఖ సిద్ధిగలుగు ;
లేనివయ్యును గలిగినట్టిఁదోఁచు।దైవసామర్థ్యసిద్ధి కుదాహరణము. 557

గీ. అనుదినంబునుకలుగుచునంతరించు । స్వప్నజాగ్రత్తలకు భేద వసతిలేదు;
భౌతికావరణంబును జేతనంబు । నవియె, సుఖదుఃఖములు నట్లె యగునుగాదె ।

గీ. స్వప్నమునువీడఁగను బాంచభౌతికంబు। భార్థివమువీడఁగను నాతివాహికంబు
పాము కుబుసములను వీడుపగిదిఁదోఁచు జీవపరిణామ మాచార్యచిత్తవృత్తి.

గీ. వాసనలు లేనియెడల స్వప్నమును దాఁటి। ఘనసుషుప్తిని జెందెను గతిని జీవి
వాసనాబీజముక్తి జీవద్విముక్తుఁ। డగును జాగ్రదవస్థయం దనఘుఁడవని. 560

చ. తలఁపఁగ స్వప్నమందుఁగను తన్వి యసత్యమె యయ్యు నెవ్విధిం
గలఁగనువానికిన్ రతిసుఖంబుల నిచ్చునొ యట్లె నెమ్మదిం
దలఁచిన భావపాటవమునం బరికల్పితమౌ జగంబటుల్
పొలుపగు స్వప్నమందుఁ బరలోకముగూడఁ దలంచినంతలోన్. 561

గీ. స్వప్నదృశ్యము కేవలాసత్యమైన। జాగ్రదనుభూతములును నసత్యములగు
నొకటి మిథ్యయు,సత్యమింకొకటి యగునె। యేకపథముననడిపించు టేమనంబు.

క. జాగ్రత్స్వప్నసుషుప్తుల। నిగ్రహశక్తిని దురీయ నిర్మలుఁడు చిరో
దగ్రస్థితి గలుగును, నే। కాగ్రసమాధియను యోగమౌఁగద యిదియే. 563

ఉ. జాగ్రదవస్థ నింద్రియ విచక్షణ మెన్నఁగ మిథ్యయయ్యు స
త్యాగ్రమెయౌను, స్వప్నమున నుండువిధంబుననొ సుషుప్తిలో
నగ్రహమౌ మనంబు కడునిర్మలతంగను వీనిలోపలన్

వ్యాగ్రితఁజెందు జీవుఁ, డదిద్వైభవ లీలయగుం బరాత్మకున్. 564

చ. కలఁగనువేళ దృశ్యమును గాంచెడువాఁడును, గల్గు కార్యముం
జెలఁగును మూఁడునేకమయి జీవునియందు సమగ్రరూపమై ;
కలుగునుమాయ జాగ్రితను గ్రాహకమున్ గ్రహణంబు గ్రాహ్య మిం
పలరఁగ జ్ఞప్తమందుఁ ద్రితయంబుగ సృష్టివిధానలీలలన్. 565

గీ. స్వప్నమున నింద్రియంబుల శక్తులుడుగ। మనసు కల్పించుసృష్టి యుం దణఁగు జీవి
మనసు నిద్రింపఁగనుసుషుప్తినివహించు। నదిచిదానందతుల్యమౌపదము గాదె !

గీ. జాగ్రితను చేయునట్టి భోజనము జీర్ణ। మగును, స్వప్నంబునందట్లె యగును గాదె
లేచునప్పటి కాభుక్తి పాచనముగుఁ। గడుపు నిండంగ లేదని నుడువు రెటులు.

గీ. వీర్యమలమూత్రపతనముల్ వేద్యములగుఁ। దనువునుండి వెడలుపదార్థంబులగుట
స్వప్నమునభుక్తిలోనికింజనదుగాన। క్షున్నివారణ యెటులౌనగూడఁగలదు? 568

గీ. కలను గలిగిన జగమెల్లఁగల్లయగును। మెలఁకువను, నట్లె యీసృష్టిమిథ్యసుప్తి;
సత్య మెల్లయవస్థలసత్యమెయగు;। రెండుఁదాత్కాలికములంతరించునవియె. 569

గీ. జాగరణమందుఁగలుగదు స్వప్నమెపుడు, । సుప్తిజాగ్రదవస్థనుజూడ మటులు
ముక్తునకు లోకసౌఖ్యప్రసక్తియుండఁగు । సక్తిగలవానికబ్బదుముక్తిపదవి. 577

గీ. స్వప్నగతి పుణ్యపాప వాసనల వలన । స్వర్గ నరకంబు లుండని చందమునను
దనువుదొరగిన జన్మసందలిక్రియలును । దత్ఫలంబులుజీవికిఁదగులఁబోవు 571

# కష్టసుఖములు.

గీ. భూనభోంతరములునిండిపొరలుతేజ । మగుట నెన్నెన్ని నామరూపాంతరముల
నైన విహారించి కష్టసుఖానుభవము । లందవచ్చును దైవమానందగరిమ. 572

క. చెడుగే మేలగు, మేలే। చెడుగగు, సందర్భవశతఁ జిత్తవిశుద్ధిం
జెడుగిది మేలిదియని చె। ప్పెడుఘనుఁ డెవ్వండుగలఁడు? పృథ్వీస్థలిలోన్. 573

గీ. ప్రతిసుఖంబునఁ గష్టము లతికియుండుఁ। గష్టములు లేని సౌఖ్యముల్ కానరావు,
కానసుఖదుఃఖములఁదుల్యగతినిబొందు। టే భగవదభిమతముగా నెఱుఁగవలయు.

చ. బలుఁలగు దంపతుల్ రతి నపారసుఖంబుల నందుకాలమం
దలసటయున్, శరీరబల హానియు, స్వేదము, పెద్దయూర్పులుం
గలుగుటఁ టంచుఁ గేళినుడ గంగల రే భగవంతుఁడట్టులే
తలఁచును సృష్టిఁగల్గు కలతల్ భరియించి విలాసమొందెడున్. 575

చ. దేహబాధలు మితిమీఱి దేహికిన్ని తీవ్రపుసహజంబుగా నది దైవవిధియె

కానఁబడరానిపాట్లనిక్కముగఁగూర్చుఁ । దతఁడెజీవాత్ముఁడై యుండు కతనఁధాత్రి

గీ. అధిపునింటమహోత్సవమగుచునుండఁ। బరిజనులుశ్రమపడుటగు వెనువఁదగునె!
హైనగీలా విహారసందర్భమునను। వానిపరిజనముశ్రమపడవలదె? మనకు. 577

గీ ఘన సమారాధనమున భోక్తలు భుజింతు।రంట్లఁదోమెడువారేద్వనగు నెయెవరి
గతికి వారలు పరితృప్తిఁగాంచ నగును। దైవ మేర్పాటుచేసిన దశలెతగును.

గీ. నిత్యములు కానివానిపై నిలుపుప్రేమ । నిష్ఫలంబగు నెప్పుడో నిశ్చయముగ
బానిసలఁగొల్చుభానిసపగిదినుండు । నైహికాపేక్షలెల్లశూన్యములుగావె!579

గీ. షడ్రసోపేతభోజనోత్సవముఁగాంచు । నాల్కయనికాళ్లుభూమిపై నడువమానఁ
దగునె! జీవులందఱుస్వీయధర్మములను । మెలఁగస్పష్టిక్రమముసాగులలితరీతి.

గీ. జీవికేగాగ్రచిత్తత చిక్కెనేని । దేహబాధ లెక్కుడుగ బాధింప వపుడు
మానసికబాధలునుమటు మాయములగు। మత్తుమందువిధంబున మైక మొదవు 581

గీ. కంటకాభావమగు కేతక కుసుమంబు । దుర్గుణము లేని శుద్ధ సద్గుణ గణంబు
కష్టములు లేనిసుఖములు కలుగ వెపుడు । దైవమునకై సలీలలఁదనరునపుడు 582

గీ. సకల కష్టసుఖముల నీశ్వరుఁడె కూర్చి । జీవులై యనుభూతిని జెందునపుడు
విస్మరించునునిజశక్తివిభవ;మదియె।జీవపరమాత్మలకుమధ్యఁ జెలఁగునియతి 583

గీ. కష్టసుఖములు భావ సంఘర్షణములు, । నవరసంబులఁ బూర్ణ సంభవము లగుసు
దైవలీలానుభవసంవిధానమునకు । వలయునన్నియుభావనాపాటవములు. 584

గీ. పాంచభౌతిక సత్త్వప్రభావ గరిమ । జీవు లణువులు చిత్కళోజ్జీవితములు
ప్రేక్షకులు సృష్టివైచిత్ర్య విశ్వనటన । కష్టసుఖములు లీలావిశిష్ట దశలు. 585

గీ. అవయవములెల్లఁ గలియ దేహమగునట్లు । దైవలీలకు జీవులందఱును వలయు
కష్టసుఖములనీఁ బోచ్చగతులఁదలఁపఁ । దగదు ప్రభుకార్యమే ఘనంబగునుగాదె.

ఉ. దైవము భావనాపటిమఁ దా సృజియించును విశ్వమెల్లెడన్
జీవులు వానియంశములు, సృష్టికి దక్షము, లాత్మనిగ్రహం
బే వలయుం దరింపఁగ జయించునె జీవుని జన్మకర్మముల్ ?
భావనయందె కష్టసుఖపాకఫలంబులు కల్గిపోవుడిన్. 587

చ. మధుర పదార్థములు గ్రహుచు మానిసికిం గటుతిక్త షడ్రస
గ్రథిత సుఖానుభూతి యెటుగల్గును? పూర్ణుఁడు కాకపోవు; నా
విధి సుఖదుఃఖభావ సముపేతము లీశ్వర చిద్విలాసముల్;
వ్యథలకు జంక మేలివిషయంబులు చిక్కునె జీవకోటికిన్. 588

గీ. ఇంద్రియములకు విషయంబులందుఁ బొందు । నెలయు వేళల సుఖదుఃఖములు ఘటిల్లు;
రాకపోకలుగల వస్థిరంబులగుట । వాని సైరింపవలయు నెవ్వనిఁ బార్థ 589

గీ. తిలలయందుఁ దైలంబుసిద్ధించునటులు । కష్టసుఖములు మానసోత్థాతములగుఁ

దిలలమర్దించి తైలంబుఁదీయుభంగి । భావసలకష్టసుఖములుత్పన్నములగు. 590

గీ. గాఢసుఖదుఃఖ బంధమోక్షములకిలను।గలుగు జ్ఞానేంద్రియగణంబుకారణంబు
ధరణి దేదీప్యమానమై తనరుటకును।సంశుమంతుండు కారణం బగునుగాదె !

ఉ. కష్టసుఖంబులెప్డు దనుకంపను జూపక పృథ్విరేఁబవల్
నిష్టఁబ్రవృత్తి వచ్చుచును నీతియుజాతియుఁ గాలుఁదొంచఁ దు
ద్దిష్టవిధింజరించు నిరతిన్ భవబంధవిధాన మిట్టిదే ;
సృష్టికిఁ గారణంబు పరమేశుని వేడుకయేకదా ! సదా. 592

గీ. ఈప్సితానీప్సితములె సహింపరాని।కష్టసుఖములఁగూర్చు నిక్కముగసృష్టి
నవియె దైవలీలలు ; వాని నణఁచివైవ।సృష్టికారణమిట నశియించిపోవు. 593

గీ. తత్త్వవిషయంబులేరీతిఁదలఁచి కొనిన। జావుబ్రతుకులుఁ దప్పని శాసనములు
పుట్టినప్పటినుండియుఁ బోదుమనెడు।దృష్టినుండిన దుఃఖ ప్రదీప్తి యడఁగు.

గీ. ప్రాణికోటుల దుఃఖ మపారమగుట।దాని వారింప నేరికిఁ దరముగాదు ;
ఛత్రియున సూర్యకాంతి కాచ్ఛాదకముగ।ధరణి సంతనుగప్పసాధ్యంబుగాదు.

గీ. స్వీయగృహమున నతిథి వసించునట్టు।లంటియంటక తిరుగు గృహస్థు ధన్యుఁ
డగును,సుఖదుఃఖములనుదుల్యగతిఁజూచి।భక్తిపారవశ్యతఁపరంపదముఁగాంచు.

గీ. కటక హేమములే మృత్తికఘటముజడము।లగుట బాధతే దెట్టిమార్పుగలిగినను
జడము దేహము జీవుఁడు సత్తు నగుట।ప్రభునికళయయ్యుసుఖదుఃఖభాజనమగు.

గీ. కలని సర్వము బ్రహ్మమే గాన భువిని।బ్రకటితంబగు భేదపరాగమెల్ల
వానికనుభూతమగుసుఖా ప్రాయముగను;।సచ్చిదానందమిది ప్రశస్తతవహించు.

గీ. కష్టసుఖములు కావడి కడవలట్టు।లెంచి కాలంబు గడపుటయే ఘనంబు;
నెమరువేసినకొలఁదిదుఃఖములుపెరుగు।సంస్మరించినసుఖములుతాన్సహామిడును.

గీ. కష్టసుఖములు లీలావికాసములగు,।న్యాయమన్యాయమను శంక లతుకవిందు
లీలధర్మాసనంబానె ? కేళియగును;।గాన ధర్మార్థ కామ మోక్షంబు లెగురు.

ఉ. కంబళిలోన భోజనసుఖం బెటులబ్బును ? ముద్దముద్ద కా
డంబరవృత్తి వెండ్రుకలు డాయును జిహ్వ, కదే విధంబుగా
నంబరవర్తియైన పరమాత్మ జగంబున మున్ను సృష్టికా
ర్యంబునఁ గష్టసౌఖ్యముల నంటియుఁ బొందఁడు భేదమోదముల్. 601

ఉ. నాటకమాడు పాత్రలె ప్రణాళిక చొప్పున హావభావ వా
క్పాటవము ల్నటించు, నధికారి మహేశుఁ డనంతపాత్రలన్
బూటకి మెప్పు నాడుతటి నూల్కొను కష్టసుఖాది భేదముల్
పాటికిఁ దెచ్చునే ? ప్రవిమలంబులు వాని విలాస సంపదల్. 602

# స్వాతంత్ర్యము.

గీ ధరణిఁ బ్రతిజీవియును వేఱుతత్త్వమగుచు। భిన్న భిన్నముగానుండి విశ్రమించుఁ,
గలిసి యేకంబుగావ వెక్కడను రెండు;। దేని వ్యక్తిత్వమిహమున దానిదెయగు.

ఉ. ఒక్కొకజీవుఁ డొక్కొక ప్రయోజనమునుంగన వచ్చిపోవు, నీ
షక్కి సమస్తజీవులు స్వభావమునం బరమాత్ము జన్మముల్;
లెక్కకుమించి వర్తిలెడు లీలల నావరణంబు గాంచుటన్
నిక్కము లంచునెంచి ధరణిన్ భ్రమఁజెందుటయే విచిత్రమౌ. 604

గీ. ఆలుమగలకుఁ గల జీవితాశయములు। మాఱియుండును దైవనిర్మాణమునను
ధరఁబరస్పరసౌఖ్య సంధానమునకుఁ। గలియుదురు, సర్వజీవుల గతులునట్లె.

గీ. ధరణి సాంసారికానుబంధములయందు। స్వీయసౌఖ్యానుసారమై వెలయుఁబ్రేమ
యెవరిగతి వారిదేయగు నీశ్వరేచ్ఛ। వ్యక్తులకుఁ బూర్ణమైత్రి సంభవముకాదు.

క. జీవంబొక్కటియైనను। జీవులనేకములు దైవ చిత్రంబిదియే

కేవల భిన్నానుభవో । జీవవ్యక్తిత్వసిద్ధిఁ జెందును దానే. 607

క. ఏజీవి జీవితాశయ । మాజీవిదె యితరజీవికంట, దిలఁబర
ప్రాజాపత్యము సరిపడ । దోజశ్శాలికి విలాస యోగము లందున్. 608

చ. మనకు స్వతంత్రమున్నదను మాటయెకాని నిజంబుఁగాంచ నే
పని మనచిత్తవృత్తి ఫలవంతమగున్ ? భగవాను చిత్తమే
పనుపడుఁ ; దత్ఫలానుభవ బాధ్యత జీవునకా ? యిదెట్టిధ
ర్మనియతి ? దైవలీలల క్షమంగలవెల్ల నిమిత్తమాత్రముల్. 609

గీ. మనవివేచన మజ్ఞానమయ మగుటను; ధర్మనిర్ధారణముసేయఁ దగము నిజము;
రజ్జుసర్ప విభ్రాంతిసంక్రాంత మగును; । దారుమారగు ధర్మనిర్ధారణములు. 610

గీ. దైవదృక్కుల మతని తత్త్వంబునుండి । పైకిఁ బ్రసరించిమరలి లోపలికిఁబోవు
మింఁదు వ్యక్తిత్వ మేరీతి నేరుపడును । జీవపరమాత్మ లద్వైతచిత్రములగు.

క. ఏయే జీవున కీశ్వరుఁ । డేయే కార్యములఁ జేయ నేర్పఱచెనో? వా
రాయా కార్యంబులనే । చేయంగల రన్యములను జేయంగలరే? 612

ఉ. జీవిని దైవమేటికి సృజించెనో? వాని విలాసపైఖరుల్
జీవి కగోచరంబయినఁ జేయునదద్దియె జీవితంబునం ;
గావున స్వేచ్ఛజీవికి జగంబున లేదు, ఫలంబు నట్టిదే;
దైవము చిద్విలాస పరతంత్రతఁ దాల్చు సమస్త భూమికల్. 613

గీ. వరలు జీవాత్మలకె వేఱు వసతి లేదు, । పరమచైతన్యమే వానిపట్టుగొమ్మ;
అట్టివానికి వ్యక్తిత్వ మమరఁజేసి । ధర ననామలఁ జేయుట తగనిదగును. 614

గీ. ఒకగడియకుముందుగానియింకొక్కగడియ। వెనుకగానిమృత్యువునాపవీలుపడదు
విధివిధించినవేళకు వెడలవలయు, । నరునిస్వాతంత్ర్యమింతయన్యాయముగద! 615

గీ. ఉద్భవించిన దేశకాలోపపత్తు । లరయ జీవితాశయ నిర్ణయంబుసేయు;
సాంఘికాచారములుగూడ సాయపడును । మానవుని స్వేచ్ఛయననామమాత్రము

క. పుట్టుటలో గిట్టుటలోఁ । బెట్టుటలో సకలకార్య విరచనములలో (గద!
మెట్టుటలో స్వాతంత్ర్యం । బెట్టిది కనుపడదు నరుల కిలలోఁదలఁపన్. 617

గీ. ఉత్తరక్షణ మేరీతి నుండఁగలదొ । తెలిసికొనఁజాల, మద్దానిఁద్రిప్ప లేము,
నరులస్వాతంత్ర్యమాభాసనటనమగును। జన్మకర్మంబులెటులు సంజనితములగు!

ఆ. "ధాత నిన్ను నేమి ధర్మంబునడుపుట । కై సృజించె దాని నాచరించి
యుండు నీవ నీకయొడయండ వేధాతృ। నోదితప్రవర్తనుఁడవుగాక." భారతము.

చ. "మనుజులు సేయనెవ్వరు? సమస్తము నీశ్వరునాజ్ఞఁజెల్లెడు
న్వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱుకంగఁ బాప మొం
దున్నొకొ కుఠారమున్ జనులు దోషముఁబొందరు కర్తయీశ్వరుం

డని యెడి నిశ్చయంబు దృఢమై మదినిల్చినఁ జాలు భూవరా!" భారతము.

గీ. దైవసంకల్ప మొనరింపఁ దనువుఁదాల్చు। జీవికది పరిపూర్తియా జీవితముగఁ
గ్రొత్తసంకల్ప మెటులొనగూఁడు వేఱు। జన్మమును గాంచ? దాని ప్రసక్తి లేదు 621

# అహింస.

గీ. నరుఁ డహింసాపరుఁడగుట న్యాయమనిరి, । హింసకు నహింసకు వ్యవస్థ యెచట
జీవనోపాధికే హింస సేయవలయు। జీవికాహారమగు నె నిర్జీవసృష్టి? (గలదు?

ఉ. మోసముఁ జేయఁబూనిన విమూఢుఁడు ధర్మవిహీన వర్తనన్
దాసుఁడుగా మెలంగి వికృతప్రతిభుం డయి, దేహమానసో
ల్లాసము లంతరింపఁజెడుఁ బ్రాణులు చిత్కళలౌట చేరసా
భాసము మిత్రవంచనము స్వార్థపరార్థము లేక మాటచేన్. 623

గీ. సకలజీవాత్మ లీశ్వరాంశములె యగుట। నేకమయ్యును దోఁచు ననేకములుగఁ
గానఁబరపీడనం బాత్మఘాతయె యగుఁ । దెలియ కజ్ఞానవశత సాధింతురవని.

గీ. లోకవిజ్ఞాన మాత్మవివేకమగును । సంఘసత్త్వంబె వ్యక్తిసంస్కారమగును
సంఘమును వ్యక్తియును దైవశక్తి యెయని। తెలిసికొనుట యె జీవిత ఫలితమగును.

గీ. జీవతతికెల్ల నీసృష్టి జీవతతియె । జీవనాధారముగఁ జేసె సృష్టికర్త;
వానిబుద్ధివైశద్యమెవ్వనికిఁ దెలియుఁ? । ధరనహింసయేరీతిసాధ్యమగు నెపుడు.

ఉ. "కాయలఁబండ్ల నీళులను గల్గవె సూక్ష్మపు జంతువుల్ ? మునుల్
సేయరె హింస వాని నుపజీవితఁ ద్రవ్వరె కందమూలముల్ ;
నీయెడఁజూడు ప్రాణములు నిల్వఁగనేర వహింస నేరికిన్ ;
వేయును నేల భక్ష్యముగ వేధ విధింపఁడె ప్రాణిఁ బ్రాణికిన్." భారతము. 627

క. "విను పశుహింసాకృతయా । గనిమూఢిని ధర్మపరుని గా వేదంబుల్
గొనియాడెడు సముచితహిం।సనమరయ నహింసగానజగతీనాథా" భారతము.

గీ. హింస నెఱుఁగనివాఁడు సహింపలేఁడు।చీమద్రొక్కఁగనైన వృశ్చికముఁజంప,
మాంసవిక్రేతకు వధ సామాన్యమగును।అరయఁబడవెట్టివికృతులభ్యాస వశత

గీ. వేదవేదాంగవేత్తలీప్సితఫలార్థ । సిద్ధికై యజ్ఞయాగముల్ చేసిజీవ
హింసఁజేయుచు నరమేధమాంసభుక్తి।నేహ్యముని యెంచరైరిమహీసురులును.

గీ. గోవృషభముల లేగలఁగూడ ఋషులు। చంపితినుచుండి రదిసాహసంబుగాదె?
బౌద్ధమతసాంప్రదాయసంభవమహింస।బ్రాహ్మణులుస్వీకరించిరలంఘ్యముగఁట.

# ధనము.

గీ. సృష్టిఁగల వస్తుసంచయం బెల్లజీవు । లనుభవింపఁగఁగలదు పూర్ణాధిపత్య
మద్దినాదనుకొనుటయన్యాయమెయగు।నఖిలజీవాత్ములనుబరమాత్మయగుట.

ఉ. దేవుని వేషధారణవిధిం బ్రభవించెడి జీవులందఱీ
పావన సృష్టివైభవమవశ్యముఁబొందుట యోగ్యమౌను ; దీ
నావనదీక్ష మేలగు ; దురాత్ములు బల్మిహరింతు రద్దియే
ద్రోవను నిల్వకేగుఁ, బరితుష్టిని గూర్పదు డాచువారికిన్. 633

గీ మంచుమృదుశీతలంబయ్యుమారుతమున। నెండుగతి యోగ్యుఁడును లక్ష్మినెనసెనేని
దుర్మదాంధతనచ్ఛతాదూరుఁడగును। మలినహస్తముసోకినమణియుఁబోలె. 634

మ. ధరణిన్ మీఁకయి కూర్పఁబోవకుఁడు విత్తం, బద్ది గొంపోవుఁ ద
స్కరుఁడుం, ద్రుప్పుగ్రసించుఁ, జిమ్మటదినుం గానన్ ధనంబిప్పుడే
పరలోకంబున మీరుచెందుటకుఁగూర్పన్ యుక్తమౌ దానిఁ ద
స్కరుఁడుం బూనఁడు, ద్రుప్పుపట్టదు తినంగాఁజాలవా చిమ్మటల్. 635

ఉ. పాముల కాకరంబయిన పాడుజలాశయమందుఁ బుట్టియున్
భూమిఁకిఁ బ్రాకివచ్చు సుమపూరిత వల్లిక, లక్ష్మి దీనికిన్
సామము లేదు, సాధుజన సంగతి నొల్లదు, కాలుగాలిన
ట్లీమహిఁ సంచరించు వరియించును నీచులఁ బాపకర్ములన్. 636

గీ. లచ్చి పరకీయ, లీలావిలాసగరిమ । నిలువదొక్కెడఁ జలరేగి పలవరించు

జిత్తజాయత్త సాధుసంపత్తిఁగనదు। ముక్తిమార్గము సరికట్టు మఁగుదసుమ్ము 637

గీ. ఘనములలమి యహాస్కరుఁ గప్పివేయు। నటులహంకృతి విలసిల్లి యాత్మఁగప్పుఁ
గాంతులను గానమొనరింపఁగల విపంచి। శత్రుషట్కము నివసించు సత్రవాటి 638

క. కరతల భిక్షాటనమున। జరుగును గాలంబు పరమసౌఖ్యమున వసుం
ధరఁ సరఘువలెను డాఁచిన। పరులు హరించెదరు దాని ఫలితంబెల్లన్. 639

చ కలధనమెల్లఁ బెట్టి తముకంబున నావను గట్టిసెట్టి యా
జలనిధిదాఁటి విత్తము వెసం గడుఁగూర్పఁగఁబోయి మఁగ్గిన
ట్లిల ఘనయజ్ఞయాగము లనేకములం బచరించి కామ్యసం
కలనఁజరించువారలు సుఖంబులఁ గాంచరు, మోసమేయుగున్. 610

చ. ఇరుపురుషేంద్రుఁ గొల్వఁగలఁడే యొకభృత్యుఁడు? వారియందు నొ
క్కరుఁగలహించి వేఱొకనిఁ గాంచును బ్రేమను, గాదయేని నొ
క్కరుకడనుండి యన్యుని నగౌరవమొప్పఁ దృణీకరించెడున్;
సిరికిని దేవదేవునకు సేవయొనర్పఁగ లేరు మీరలున్. 641

గీ. ధనముగలిగిన సౌఖ్యమందఁదగుఁగాని। దానివలనను గలుగు చింత లమితములు;
శతగుణాధిక దుఃఖసంతతులఁబడుట। కంటె నిర్ధనుఁడై స్వేచ్ఛఁగనుట మేలు. 642

# చిజ్జడములు.

గీ. చేతనాచేతన సమిష్టి సృష్టియయ్యె । వ్యష్టిలయమగు,మిగులునదేది యుండు!
జడముజీవముకలిసినజంతువయ్యె;।నొకటిచెడిననుమిగులదింకొకటియెపుడు. 643

గీ. పాపమొఁ రించి దేహము పతనమొందెఁ । జేతనంబగు జీవికా! శిక్షణంబు!
తనువుఁ బాయుటచేదానిఘనతయుశిగెఁ,గానఁదనుజీవులకుశిక్షగలిగెనిచట. 644

గీ. గర్భధారణ మాది యేకముగఁ బెరిగి । దేహిదేహంబు లేకరీతిని నశించు
నిట్టియవినావిధానంబు మట్టుమాపి। దేహమునశింపమిగులును దేహియనిరి. 645

ఉ. జీవములేని దేహము సృజింపఁడు, దేహములేని జీవమున్
భావనసేయఁ, డేకముగ నన్నిలిఁ గూర్చును రెంటిజంటగా
దైవము; పెంచుజంటగఁ, దువన్విరమించును రెంటిజంటగా,
నేవిధి జీవి నిల్చునని యెంచఁదగుం? దనువంతరించినన్. 646

గీ. చేతనము లేని సృష్టి యోజింపఁ గలదె?।దాని వికృతియె ప్రకృతిసంధాననుల్ల
ముక్తములు క్షణికా భాసములు, విలాస।నటన లీశ్వరపర్యటనములగుములు.

చ. జననమునందు శైశవదశం గ్రమవృద్ధిని గాంచు చుంగియున్
ఘనముగ; వార్ధకంబునను జ్ఞానముతగ్గు శరీరకార్యతం;
దనువుచు నాత్మ యేకపరతంత్రత సీగతి హెచ్చుతగ్గుటల్
గన, నవినావిధానము చెలంగును జీవికి దేహమం విలన్. 648

గీ. దేహమంతరించిన పైన దేహిమాత్ర మేలమిగులవలయు? నిత్య మెట్టులగును
దేహిదేహములకు వేఱుతీరు లేల । రెంటికిని మూలమొకటిరేని రెండుకావు.

గీ. జడము చేతనమును రెండుజాడ లేల! । చేతనము దైవమునకేల చెందవలయు?
జిజ్జడంబుల లీలకై సృష్టిచేసి । మాయ మొనరింపలేఁడె సమర్థుఁడుగద? 650

ఉ. దేహము నశ్వరంబనియు దివ్యతరాత్మ నశింపదన్న వ్యా
మోహము చేత స్వర్గమునుబొందఁగఁ గోరుదు రెల్లవారలు
త్సాహముతోడ, స్వర్గమును స్థానము వేఱుగ లేఁదటన్న నీ
దోహదముండ దైహికవిధుల్ క్రమపద్ధతిఁ దీర్పమేలగున్. 651

గీ. చిజ్జడంబులు భగవద్విశేషగతులు । వివిధరీతులఁ బ్రసరించి విశ్రమించు
భూతములఁ జేరుజడమునప్పుతముగాఁగ। నవియుబరమాత్మకళలు భవ్యములు చెడవు.

గీ భౌతికంబున దైవమెప్పుగిదినుండెఁ । జేతనంబున నట్లు వసించుఁగాదె?
తనువుజడమని నిరసింపఁజనదు మనకుఁ । జిజ్జడంబులు దైవవిశేషగతులు. 653

ఉ. దేహమనుక్షణంబు జగతిం బరిణామముఁ జెందుచుండు, వ్యా
మోహము వ్యర్థమొక్క క్షణముండగ నిల్వదు ద్వాదశాబ్దముల్
దేహియునట్లె యీశ్వరుని దివ్యఫలావళిఁ జేరిహత్తి య

వ్యాహతవృత్తితోడఁ బునరాగతుఁడై చరియించు పేంలలన్. 654

ఉ. జీవము దేహముం గలియఁ జేతనమై వికసించెఁ వీడినం
బోవును రెండు, ద్వైతమటు పుట్టెనో? గిట్టెనో? యద్వితీయుఁడో
దైవమునందు? జీవతనుతత్త్వవిభేదము చెల్లదేకమౌఁ
బావనచిద్విలాస మనవచ్చుఁ దలంప మహేంద్రజాలమౌ. 655

# సంకీర్ణవర్గు.

మ. భగవంతుక్ గుణశూన్యునిన్నలుప సర్వజ్ఞత్వముం బోయె, మో
హాంగతిన్ మాయను గూర్చ దానివశమై బ్రహ్మంబుగా సృష్టిసే
యఁగ సర్వంబును ఖేదపూరితముగా నయ్యెన్, విలాసం బహో!
జగదాధారుఁడు సృష్టికర్తకివి భోజ్యంబయ్యె వేదాంతమై 656

చ. పొసఁగ దశావతారముల భూస్థలి నెత్తిన లోకరక్షకుం
డనయము వచ్చిపోవుటయె యయ్యెను గాని ధరాతలంబునన్
ఘనతర శాశ్వతప్రతిభఁ గాంచఁడు, తక్కిన జీవకోటులుం
బనివడి మృత్యువున్ గెలిచి వర్ధిలనేర్తురె? శాశ్వతంబుగన్. 657

గీ. ప్రతినరుండుఁ బరోపకారమ్ముఁ జేయఁ। బూనుకొనినను స్వర్గము భూమియందె
యవతరించును, దైవనియామకమిది। దానిఁదప్పినవారె యధర్మపరులు. 658
గీ. జలమునందుండు జీవులే చందమునను। బ్రాణవాయువుఁ బీల్చి జీవములనిల్పు !
వేఱువిధమగు మరలఁగల్పించె దైవ। మునకసాధ్యంబెపెయు నుండఁబోలదవని.
గీ. ఆఁ బ్రతివుఁ బురీషముం గ్రిము లనుభవించు। నందఱి విలాసమూపరమాత్మ కెఱుక ;
క్రుళ్లువస్తువుల్ జీవసంకులములగును। మనకసహ్యము సహ్యమీశునకుఁగనఁగ.
గీ. అరయ నఖిలాండకోటి బ్రహ్మాండములును। ఘనచతుర్దశ లోకసంఘటనమేల?
నేకలోకంబునందె ప్రత్యేకదశలు। కలవు తరతమ భేద సంస్కారమునకు. 661
చ. శునకము నోటియామిషముఁ జూచి జలప్రతిబింబమందు, దా
నినిఁగొన నోటికండవిడి నివ్వెఱఁజెందెడురీతిఁ బాపమా
నసక పరార్థముంగొనఁ బ్రయత్నముసేయు నరుండు కాంక్షితం
బును గనలేక దుఃఖమున మున్నినిజార్థముఁగూడఁ గోల్పడున్. 662
చ. తరువులఁగాంచ స్వార్థపరతంత్రతవీడి పరార్థసేవ ను
ద్ధురముగఁబత్రి పుష్ప ఫల తోయములిచ్చుచుఁ బాంథపాళికిన్
ఖరకర తీవ్రతాప ముడుగంగల నీడలొసంగుచుండు, నీ

పరమ పవిత్రభావ సేతుపార్జకుఁ డౌ నరుఁడు ధన్యుఁడౌ. 663

ఉ. మానవజీవితంబులు క్షమంబరిపాటిగఁబోవు, వానిలో
జ్ఞానులు, ధీరతం బ్రకృతి జాతకితీతులు గాఁజరింతు రం
దైనను గోటికొక్కఁడు జయంబునుగాంచును వానికాత్మ సం
ధానము రూఢమౌను, నిజతత్త్వము గోచరమౌ ధరిత్రినే. 664

గీ. లోకులాత్మ విలోమ, విలోమగతుల।జీవితంబుల వెళ్ళఁబుచ్చెదరు సరళి
నున్నతాత్మల కీర్తి లొప్పవవని।భౌతికాతీతములు వారి పర్యటనలు. 665

గీ. అనుభవములేని జ్ఞానంబు, సక్కఁ డకును।కాని చుట్టంబువంటి వరాతులగును;
సకల వేదాంతవాక్య సంసాధనమున;।నేమిలాభ మాత్మజ్ఞాన హీనుఁ కును 666

ఉ. ఇంద్రుఁ డహల్య దుష్టవిషయేచ్ఛను మోసముచేరమించె, నా
చంద్రుఁడు విద్య నేర్పుగురు జాయను దారనురక్తిఁగూడె, ని
స్తంద్రుఁడు విష్ణుమూర్తి సురతక్రియబృందను మోసపుచ్చెఁ, బం
చేంద్రియ పీడనీశులు సహింపఁగ లేరనితోఁచు సత్యమై. 667

గీ. దైవమప్రయోజన జీవితమును నిల్పఁ।డాకిఁ యకు వానికే తెలియంగనగును
వాని చిత్తంబు నెరవేర్పవలయుఁ గాన।నాత్మహత్యను బాతకమనిరి బుధులు.

గీ. పాంథునకుమరుభూమిఁ బ్రాప్తమగునటుల।జీవి మిథ్యాజగంబునఁ జిక్కువడి యె
వాఁడు కీచక దండంబు పగిది వదల।కాలగతి నంతరించు సంస్కారముడిగి. 669

చ. సమరము దారుణంబగు ప్రజాక్షయ హేతువు, తీవ్రపాప సం
ప్రాప్తము, పరోపకార పరిరక్షణ శూన్యము, గర్హ్యమైన, యో
గ్యముగను వీరనాకమును గం బరికల్పనఁ జేసి నిర్జరీ
సుమశర కేళిఁ గూర్చి రిడిమాడఁగ నేహ్యముగాదె యెంతయున్. 670

గీ. ధరణిమరణించునదియభూతమయతనువు,। చేతనమొకటియనాటనశింపదెపుడుఁ;
జచ్చునెడ జీవులందఱుఁ జావవలయు।జననమరణంబు లనున వసత్యగతులు.671

ఉ. దేవత లప్సరోంగనల దించిరిపో వ్యభిచారవృత్తికిం
గేవల వేశ్యకాంతల సుఖింపఁగ మానవులట్లు చేసి రీ
భావము లెట్టు లర్హమగు బ్రహ్మమునందుఁ దరింపఁ జూచునీ
జీవుల, కాత్మతత్త్వము నశింపదె? దేవత లెట్టివారలే? 672

ఉ. కేవల జీవహింసఁ గలిగించెడి బాధక చిద్విలాసమే
పావనమూర్తి చిత్తమునఁ బన్న, నదృష్టము నిగ్రహింపఁగా
జీవుల శక్యమా నె? ప్రభుచిత్తమె యాచరణీయ మాన్యతా
రావము మంగళాచరణరక్తిని గూర్చు లయాధికారికిన్. 673

గీ. సూర్యుఁడాకాశమున వెల్గుఁ జూపుచున్న। గుడ్లగూబ దివాంధమై క్రుంగునట్లు

జ్ఞానవంతుఁడు జీవి యజ్ఞానియగును। దేహధారణావశమునఁ దెలియలేఁడు. 674

చ. జగతి సమస్తసౌఖ్యముల శ్రద్ధసమర్చిన శోభగల్గు స
న్నగరము దేహ మాత్మకిఁ, జ్ఞానికి మోక్షముగూర్చు నన్నిటన్
వగఁగలిగించు నష్టనకుఁ; బ్రాప్తములౌ సుఖదుఃఖ సంపదల్
మగటిమి గల్గుజీవి క్షణమాత్రమునన్ సవరింపనోపెడిన్. 675

గీ. పట్టణమున నుండఁదగిన వసతులెల్లఁ। గలవు దేహమునందు, సౌఖ్యముగ జీవి
రాజ్యపాలన విధుల ధర్మముగ నెరపి। సచ్చిదానందములనందవచ్చునిచ్చ 676

గీ. చిత్తవృత్తులకును లొంగి మత్తుఁగన్గిన। నగరపాలనమెల్ల వినాశమగును;
జీవియును దుఃఖసాగరోచ్ఛిష్టుఁడగును। నిరయకారణమగునది నిశ్చయముగ.

ఉ. ఒక్కొక జీవికీశుఁడిడె నొక్కొక దేహము స్వీయ రాజ్యముం
జిక్కి మనోభిలాషముల శ్రేయము నెంచక దుర్మదాంధతన్
వ్రక్కలుఁ జేసి రాజ్యమును రాక్షసకృత్యము లాచరింప నిం
కెక్కడిముక్తి సౌఖ్యముఁ కనేగతిఁ జిక్కును? మానవాళికిన్. 678

గీ. సృష్టికార్యంబునుం గూడ జీవులమోద । కంటఁగట్టఁదలంచి సౌఖ్యాధికంబు
ప్రీతిఁ గల్పించె రతుల నష్టద్వయముగను। స్త్రీపురుషులకు; దైవముదీర్ణశక్తి. 679

గీ. ప్రాప్యముగు సీశతత్త్వమీ వపువ్రసందె । కలుగుటనునన్య దైవతా కాంక్ష లేల?
వచ్చినవరుండు ప్రాప్తమూ నాతిమనుష్యుఁ। గోరదాతని కొఱకు; జుగుప్సపడను

గీ. కాలగతినీశ్వరేచ్ఛచేఁ గలుగుచుండు।శతృమిత్రవర్గము, వానిసంచరణము
వ్యక్తిగతమెట్టులగు సర్వశక్తిమంతు।సృష్టివైచిత్ర్యమునకివి శ్రేష్ఠములగు. 681
గీ. అస్థిరంబయినట్టి దేహంబుకొఱకు।దివ్య భవనంబునిర్మించి తిరుగనేల ?
పరులుకట్టిన యిండ్లలోపల వసించి।పామువలెఁ గాలమును బుచ్చవచ్చుఁగాదె!
గీ. అగ్నిహోత్రునిసూర్యునినాశ్రయించు।వారు చలిగాలి చీకటిఁ బడయనట్టులు
సాధు సజ్జన సంసేవసలుపు వారు।నిరయ సంసారదుర్గతి నరయఁబోరు. 683
గీ. రాజదండనమందిన భూజనునకు। యమునిదండన కలుగదంచండ్రుబుధులు
రాజదండనమునుండిన రాష్ట్రజనులు।యముని చేఁజిక్కరనుట యథార్థమగును.
గీ. పాముకాదు త్రాడని చెప్ప భ్రాంతిపోవు।నట్టుజగన్మిథ్యయని యెంతయుటమటించి
ననుబరబ్రహ్మజీవి కానంద మిడఁడు। చచ్చుదనుకను నితిలేని శ్రమలముంచు. 685
చ. కమలమువృద్ధిఁజెందు నుదకంబున మెట్టనువాడిపోవు, న
ట్లమలమనీషులైన సరసాత్ములు భూతదయార్ద్రబుద్ధిచేఁ
గ్రమగతి వృద్ధిఁగాంచెదరు కర్ణకఠోర దురంత దుష్ప్రచే
యముగలవారలైన నిరయంబునఁ గూలినశింతు రెంతయున్. 686
చ. తనువు ప్రవర్ధమానమయి దార్ఢ్యముఁగాంచుట భుక్తిచేతఁ గా

పునఃసనన్ రసగ్రహణ పూర్వకశక్తి ఘటించె, సంతతిం
గనఁ బ్రణయప్రపూర్తిని డెఁగాంతకు భర్తకు ; క్షీరధారలన్
స్తనములనింపెనాతికి ; విధాత్రు విధానములెన్న శక్యమే ! 687

ఉ. అవనిసతీసుతుల్ గడుసహాయ నిరాకరణంబొనర్చి స
త్తమమగు బిడ్డలంగనుట మానినలోకము నిర్జనంబగున్
భవభయమేగుఁ, గర్మములవాసనలెల్లనశించు, సంతసం
ఘువిమల తత్త్వమే మయిన గాంధిమహాత్ముని ప్రజ్ఞవర్ధిలున్. 688

గీ పరుల కుపకారమునుజేయు వానిజన్మ। మైహికాముష్మికంబుల కాటపట్టు
సకలమతతత్త్వసారమీశ్వరనిదాన। మింమమూర్తిభవించి పెంపొందుచుండు.

గీ. నిర్జనారణ్యకృతయోగనిష్ఠకంటె । వినుతగార్హస్థ్యధర్మసాధనమె ఘనము
దేశసేవయె భగవదుద్దేశమగును । వ్యర్థవనవాసమాత్మ కనర్థకంబు. 690

గీ యోగవలెనుండి యలదైవమును స్మరింప। నేమియానందము కుబేర మేశ్వరునకు!
వినుప్రజనిఖించు;జనులసేవించు నెడల।నుభయతారకమగు నాత్మయునుదరించు

చ. మనపరిచారకుల్ పనులమాని యధేచ్ఛగ స్తోత్రపాఠముల్
ఘనముగ సల్పుచున్న విఫలంబగు గార్యములెల్ల; నట్లె దే
వునిపనులందు త్యజించి పరిపూర్తిగ నామజపంబుఁ జేసినం
దనియునె? మోహ్యమునా, మనసంబు ఘనంబని యెన్నఁ జెన్నఁ గున్. 692

చ. సుఖముగ సంసృతిన్నెరపుచున్ వ్యవహారము నైచ్ఛికంబుగా
నిఖిలముసాగుచుండు నెడ నిర్మలతత్త్వము దైవభక్తి స
న్ముఖమునఁ జేరఁబోవు, వ్యథమూగిన యప్పుడు దైవతత్త్వముల్
ముఖముల దానధర్మముల మాటస్మరించుఁ దపించు జీవికిన్. 693

గీ. ఐదుగురు భర్తలతిబలు లమరియుండ । ద్రౌపదికిదృష్టి కర్ణుపైఁదవిలెనంట
బహుపతివ్రతాతిలకమీమాఁపడఁతియిన్న । దునవగాహంబుధర్మవిధ్యుక్తపథము. 694

మ. మలమూత్రంబులు దేహముం బెరుగు సమ్యగ్భక్తిచే, నైనను
న్మలమూత్రంబుల నేవగించి, తనువున్నన్మానముం జేతు ర
జ్ఞులు, సర్వంబును దైవ చిహ్నములు, విజ్ఞుల్ తుల్యరీతిన్మదిం
దలపోయంజను, భేదభావము లసత్యంబుల్ మనోభ్రాంతులౌ. 695

గీ. సప్త సంతానమునుగని చంపెగంగ । పసి నిసుంగులగంగలోఁ బాఱవైచి
వారికామృతిమెతరణోపాయమయ్యె । నాపెశిశుహత్యదోషంబునందదయ్యె. 696

గీ. విష్ణుపాదోద్భవియు, శివప్రియయుగంగ । శంతనునికూడిసంతతి సంతరించెఁ
గాని వ్యభిచారదోషంబుఁగాంచదయ్యెఁ । బాపపుణ్యావిభేదవైభవముఁగనుఁడు.

క. స్త్రీపున్నపుంసకోద్య । ద్రూపములీశునకు లేక లోకంబుల నా

లోపముఁ దీర్చుకొనం ద ద్రూపంబులఁ గ్రీడసలుపు లోలాత్ముండై. 698

క. పతికిని సుతులకుఁ దెలియఁగ । బతివ్రతను సతిగుణఁ బొందు పద్ధతిపూర్వ
శ్రుతులనుమతించెఁ గావున । సతీమణుల కేకపురుష సంస్కృతి బాసెన్. 699

గీ. పూర్వకాలమున నతిథిపూజలందు । గృహిణి కామోపశాంతిఁ బూరింపవలయుఁ
బతియు హర్షించుఁ బరమ పావనమటంచు । నందు వ్యభిచారదోషంబు నందరెవరు.

గీ. యజ్ఞయాగాదికాగ్ని కార్యములనడుప । ధర్మసంతానమును గూర్పఁ దన్వఁగొనిరి
దారనర్పించుటయుఁ గామతప్తులకును । నతిథి సత్కారమున కొక యంగమనిరి.

గీ. వైభవం బెల్లఁ బ్రకృతిసంభవమతఁ గుడువఁ । బురుషుఁ డనిమిత్తమాత్రుఁడై పొదుగు
నతివ సాంసారి కానందమనుభవింప । సంతరించును బతి సర్వసౌఖ్యములను. [సృష్టి

గీ. మధురమగు తేనె జిహ్వకనుర్వఁ బూని । తేనెటీఁగల పట్టును దీయునటులు
సృష్టిలోఁ బడి ధాతకృశించుచుండె । మనసముకలీల యెటులు సంప్రాప్తమగును 703

క. విషమమృత ప్రాయంబై । విషానమును పంగఁజాలు భేషజమగు మా
నుష దేహంబులకనుచున్ । భిషగ్వరులు వాడుచుంద్రు పృథ్విగరళమున్ 704

చ. సురతి విషయంబునందు నికరంబుగఁ గీడును మేలునుండుఁ ద
ద్గతిఁ బరికించి వాడుకొనఁగల్గును సౌఖ్యము, భోజనంబునం
చితగతిసేయ పుష్టినిడుఁ, జేటగు నెక్కుడు భుక్తిఁ జేకొనం
బతనమునందు జీవితవర్తన దాఁటి చరించినప్పుడే. 705

గీ. పుత్త్రికనుగన్నతండ్రి ధరిత్రిఁదలను । వంచుకొని యుండవలయును వానిజన్మ
దుర్భరంబగు ఖేదముతో శపించు।ననిఖురానునఁగలదు సత్యమగునదియు 706

చ. హితులగు బ్రహ్మవిష్ణు పరమేశ్వర ముఖ్యులు దేవతల్ సతీ
సుతహిత బంధువర్గ పరిశోభితులైరి నరుల్వలెన్ దివిన్
శతముఖుఁడైన నేమి! పరుషంబగువర్తనగాదె! వీరిదే
వతలన నెట్టి గౌరవము వర్ధిలు? మానవ మానసంబులన్. 707

క. వేలిమి బంగారము నే । లీలఁ బుటంబున వైచి వ్రేల్చిననదియో
మేలగునట్లేజీవులఁ । బాలించుఁ బరాత్మ కష్టభారంబులచేన్. 708

గీ. పాంచభౌతిక సంస్పర్శ వడసి విత్తు । వృక్షమై బీజములఁగాంచు విధముగాను
కర్మసంస్కారమున జీవకళను జెంది । బ్రహ్మమీ సృష్టిఁగాంచియు బ్రహ్మమగును

చ. తొలకరివానకున్మొలిచి దుబ్బులుగట్టినపైరు పిమ్మటన్
సలిలముచాల కెట్టిఁబడి సస్యసమృద్ధి నెసంగనట్లుగా
నిలజనియించి వృద్ధినెనయించెడి జీవులు మర్త్యనెప్పుడో
విలయముఁజెంది యీగ్గెవరు, విశ్వవిభుం డభయంబు గూర్పఁగన్. 710

# శ్రీ రామ తత్త్వము.

సీ. శ్రీరామచంద్రుఁ డాశ్రితజనావనదీక్షుఁ రాక్షసేశ్వరు విదారణ మొనర్ప
ధర్మసంస్థాపనార్థము భువినవతరించిన భగవంతుఁ డత్యనఘమూర్తి,
తండ్రియాజ్ఞను జవదాఁటక దండకారణ్యంబునకుఁ బోయె రమణితోడఁ,
నేకపత్నీవ్రతోద్రేక మీపుడమిభునకే యలవడె నాకాలవిలసనమున

గీ. దుష్టనిగ్రహ పావనోద్యోగపరుఁడు। ఘోరదానవ సంహార ధీరవరుఁడు
తాపసాశ్రమ రక్షణోద్దామ యశుఁడు। మనుజమాత్రుఁడు కాఁడు రామప్రభుండు

సీ. పరవాసమున నున్న పడఁతిని జేకొనె నగ్నిపరీక్షచే సర్వమనుచుఁ,
బామర లోకాపవాదంబునకుఁ జంకి యడవిపాల్జేసెఁ జూలాలి సతిని,
వనచరంబనుమిష వాలిఁ జాటునడాఁగి శరపాతమున వినాశనముఁ జేసె,
శత్రుసోదరుని లంచమునిచ్చి దరిఁజేర్చి గుట్టుమట్టు నెఱింగి కూల్చెనసురుఁ,

గీ. చిరము సేవించినట్టి సోదరుని విడిచెఁ। జరమ దశయందు లక్ష్మణస్వామినహహ
రామభద్రుని సూక్ష్మధర్మప్రవర్తనము దురవగాహముగును మానవులకిలను.

సీ. మునిశాపమున విస్మృతిని జెంది స్వప్రజ్ఞ మానవేంద్రునిరీతి మహిని మసలెఁ
బూర్వదివ్యస్మృతి పోవుటచే మర్త్యులనుబోలె దుఃఖము లనుభవించెఁ,

బితరులకును సతీసుతులకు దూరుఁడై ఘోరాటవులను సంక్షోభమొందె,
మృగయావినోద మిమ్మేదినీశుఁడు సల్పి జీవహింసను బ్రకాశింపఁజేసె,
గీ. రాజనీతికి దైవధర్మంబునకును । హాస్తిమశకాంతర విభేద మగునుగాదె!
సర్వసముఁడీశ్వరుఁడుసర్వసాక్షియగును। జారచత్రుఁడురాజుస్వచ్ఛందుఁడగునె?
సీ. సాంఘికధర్మ సంస్థాపనార్థము రాజు దండించుఁ బతితు దోర్దండ పటిమ;
అఘపుణ్య సువిచక్షణాభావమున దైవ మెల్లజీవుల సాకు నేకరీతి,
గ్రహకూటమును,భూతగణమును, సమరీతిఁ బ్రసరించు భేదభావమును గనక,
ఐహికాముష్మిక వ్యాపృతి పొసఁగదు లోకద్వయోపేతమా కతమున,
గీ. మహిత భూలోకవాసులు మనుజవరులు,।ప్రథిత సురలోకవాసి దైవంబనంగ
నిరువురకుసామరస్యంబువరలు టెట్లు?।మానవుండైనదైవమేమాడ్కి-మసలు!714
గీ. దైవతుల్యముగా దవతార మీను, । మానవునకంటె మేటిగానౌను దలఁప,
దైవమానవ సంకర తత్త్వమద్ది । తమగు,నవతారములిల నిదర్శనములు.715
చ. ధరణి దశావతారముల తత్త్వములం దలపోసిచూడ, దా
శరథియె దుఃఖభాజనుఁడు,సౌఖ్యమెఱుంగఁడు, కష్టజీవి, భూ
వరుఁడని రాణివాస సుఖవర్తన మందక కానసంబులం

డీకొని నిశాచరాధములఁ ద్రెంపునఁ ద్రుంచెఁ బరాక్రమంబునన్. 716

ఉ. ఐహిక భోగసంపదల నంతగఁ గోరక జానకీ మహో
త్సాహముఁ గాంచి, ఘోరవనవాసమునన్ సతిఁ బాసి, చోరుఁడౌ
ద్రోహిని రావణాసురుని ద్రుంచి, మహాహవకేళి, భార్యను
త్సాహముతో గ్రహించి, క్రమదంబునఁ జేరె నయోధ్య శాంతుఁడై. 717

ఉ. పామరు లాడుకొన్న యపవాదముచేతఁ బతివ్రతామణిన్,
రామను, గర్భభారమున రంజిలు జానకిఁ బ్రేమఁ జూడక
ద్దామ వనాంతరంబుల వెతల్ బడఁ బంపె, నమానుషంబగున్
రాముని యీచరిత్ర మతిరౌద్ర మనిర్వచనీయమౌఁ గదా ! 718

ఉ. జనకుని మందిరంబునఁ బ్రశస్త విశుద్ధిఁ బ్రవర్ధమానయై
యినకుల సార్వభౌము హృదయేశ్వరియై, వనవాసమందు రా
వణుఁడు హరింప, యుద్ధమున భర్త జయించి, గ్రహించి, గర్భిణిన్
వనముల పాలుసేయు నపవాద మిషంబున, గ్రుక్కె సీతయున్. 719

ఉ. రాజిత దివ్యసౌధ పరిరక్షిత, భూవరు రాణివాసమం
దోజను భోగసంపదల నుత్తమ శక్తిని నందనోప్పు సా
ధ్వీజన యోగ్య సౌఖ్యములఁ బ్రీతి వహింపక, కాననంబులం
భూజితయయ్యెఁ, గష్టములఁ బొందుచు జానకి జీవితాంతమున్, 720

సీ. పతివక్షమున నెక్కి భద్రపీఠము వైచి మురిపించి మురిసె నిమ్ముగను లక్ష్మి,
పతి నెత్తిపై నెక్కి ప్రతిఘటించుచు వేడ్కఁ దైతక్కలాడెఁ బ్రాక్తరుణి గంగ,
యర్ధశరీరంబు నాక్రమించి పరేశ రాగరూపిణియయ్యె రమణి గౌరి,
విధిచతుర్ముఖముల నెలుఁగొంది యెల్లెడఁ బలికించె జీవుల భద్రవాణి,
గీ. కాని భూపుత్రి ప్రథితరాఘవుని జెట్ట। బట్టి కడగండ్ల పాలయ్యె; భ్రమరకీట
ధర్మమీ యెడఁగడుఁ యథార్థముగనొప్పె;। భర్తవెంగష్ట మొందుచుఁ బ్రతిభఁగాంచె.

ఉ. ఈగతి రాజదంపతు లభీప్సితకాములు గాక, యైహికో
ద్భోగములం ద్యజించి, వనభూముల రాక్షస మధ్యమందు, దు
ర్భోగమునంది, ధీరత వియోగమునోర్చి, విశుద్ధ జీవులై
భాగవతాగ్రగణ్యమగు పద్ధతిఁ బుచ్చిరి జీవితంబులన్. 722

గీ. జానకీదేవి జీవిత చరితమరయ। సతుల కాదర్శముగనొప్పెఁ బ్రతియుగమున
రామచంద్రునకంటె నిర్మలినవర్తనమును నెఱపుటచేత ధన్యయై యొప్పె.

మ. రణరంగంబున రామసోదరుఁడు మూర్ఛం గ్రుంగ నత్యంత దా
రుణభంగిన్, ఘనుఁడాంజనేయుఁడతి ధైర్యంబొప్పు సంజీవి దే
బునరుజ్జీవితుఁడయ్యె లక్ష్మణుఁడు, రాముండున్ముదంబందె, రా

వణ సంహారవిధిన్ విభీషణుఁడు చెప్పం బూ_త్రియమ్యెం దుదిన్. 724
గీ. వాలిఁజంపుచు సుగ్రీవు నేలుటయును, నసురు విభీషణు నాదరించుటయును, 'రాజ
నీతి కానోపు, ధర్మ పరిపూతమగునె?|మైహికాముష్మికముల కెట్లగునుసంధి?
ఉ. కోఁతులతోడ సఖ్యమొనగూడుట చిత్రము, చిత్రము వారువీరు సం
ప్రీతిఁబరస్పరం బుచితరీతి సుభాషితముల్ రచించుటల్,
కోఁతుల నాతులన్ సురలుగూడ నపత్యము లుప్పతిల్లు నా
రీతి విచిత్రమౌను, వివరింపఁదరంబె సురాళి చైదముల్. 726
చ. అమరులు దేవతాంగనలయందు సుతావళిఁ గాంచలేరు, వా
రు మనుజ కాంతలం గలిసి, ర్యాషిగ బిడ్డలఁ గందురంట, యా
యమరుల వారకాంతలు ప్రియంబున మానవసంగతిన్ మనో
రమమగు సంతతింగని ధరన్విడి పోవుట సాంప్రదాయమౌ. 727
మ. అవతారంబులు జంతుసంతతులయం దావిర్భవించెన్, మహా
జవసత్త్వంబుల ఘోరదానవుల శిక్షించం బోర్పి రత్యుగ్రులై ;
దివిజుల్ మానవకాంతలం గలిసి రా ఖ్యాతిన్ మున్ పురాణంబులన్
భువిఁదిర్యక్కులఁ గూడుకొందుఁ గన మైనం గాంతు మీగాథలోన్. 728
గీ. ఐదువందల పత్నులఁ బాదుకొలిపె । రాణివాసాన దశరథ రాజమౌళి ;
ధర్మసంస్థాపనం బెట్లు నిర్మలమగు।నిట్టి ప్రభువుల చేతుల మట్టుమణఁగు. 729

చ. దశరథుఁ డంగనాజన మద ప్రియుఁడై పటు సతీసుతాళి దు
ర్దశఁబడఁ ద్రోసెఁ గైకకనురక్తుఁడుగాన వశంవదుండునై
దశదిశలందు దుర్యశము దార్కొని పర్వఁగ దేహముక్తుఁడై
ప్రశమితుఁడయ్యె; నిద్ది గుణహారము నేర్పదె సర్వకాలమున్. 730

చ. ప్రతివిషయంబు యుక్తగతి వర్తిలఁజేసిన సౌఖ్యమబ్బు; నౌ
చితి మిఱమించు వారలకు క్షేమము కల్గదు హానియే యగున్
హితమతిఁ గైకయున్ దశరథేశ్వరుఁడుం దగురీతినున్న దు
ర్గతిఁ బడియుండ రీనియతిఁ గాంచి తరింతురుగాక మానవుల్. 731

మ. పరకాంతారతి దుర్భరంబయినఁ బాపం బందుచేఁ బంక్తి కం
ధరుఁడార్తింబడి వంశనాశమున నంతంబయ్యెఁ బూర్ణార్తి; భా
స్వర సద్యోగ తపోబలంబు లడిగెన్, సర్వస్వమున్ శూన్యమై;
తర మే బ్రహ్మకునైనఁ బాపఫలముల్ తప్పింప లోకత్రయిన్. 732

సీ. దానవుఁడై విభీషణుఁడు ధర్మపథంబున సంచరించుటం
బూసిక ముక్తిమార్గమునఁబోవఁడె దలంప మహానుభావుఁడై;
వానరులల్లె సద్గతికిఁ బాత్రతఁ గాంచిరి సత్యసంధులై;

మానవులకు సముద్యము సమున్నతులౌచుఁ దరింపనోపెడిన్. 733

చ. వరములనిచ్చు దేవతలుపాసకవర్యుల యోగ్యతల్ బరా
మరిక యొనర్చి యెంచవలె; మత్సరులౌ నెడ నేర్పునన్ని రా
కరణ మొనర్పఁగావలెను, ఘాతుకులౌ నెడ నెల్లలోక సం
కరమగు; రాక్షసాధముల గాథల నెంచ నిదర్శనంబులౌ. 734

సీ. యోగ్యతలఁబట్టి వరముల నొసఁగ, నవియు। ధర్మవర్ధనకారకసార్థకములగును;
దుష్టుల కొసంగు వరములు దుఃఖభాజ। నములు వారికిఁ బైవారికమితముగను.

క. సోదర సౌభ్రాత్రంబును। నీదశరథరాజపుత్రు లిలనిల్పిరి, యి
మ్మాదిరి మానవులందఱు। నా దైవాపత్యములను సర్ధము పోసఁగున్. 736

క. భిన్నోదరు లయ్యును స। త్సన్నతి సోదరులకంటె నొప్పుగ భ్రాతల్
సాన్నిధ్య సౌహార్దంబుల। నెన్నఁబడిరి తను చతుష్క లేకాత్మలుగన్. 737

చ. భరతుఁడు రాజ్యమబ్బినను వాంఛను బొంగక, రామపాదుకల్
వరలఁగ నిల్పి మంత్రులు ధ్రువంబుగ నేల, మునిప్రవృత్తిమైఁ
బరపురవాసమున్సలిపె, వాని నివృత్తి యమేయ మిట్టి స
త్పురుషులు దేవమానవులె పో; సురవర్గమనంగ నిట్టిదే? 738

చ. జననిని, బుత్రవత్సలను, సర్వవిధంబుల నీసడించె, బా
వనుఁడగు రామభద్రు వనవాసము కోరుట నీచమంచుఁ; దా

జనపద వాసియై సకలసౌఖ్యములం గ్యజియించె మౌనియై
ఘనుఁడవతారమూర్తి యనఁగందగు నాభరతుండు భూస్థలిన్. 739

మ. అలసౌమిత్రి స్వకీయజీవితముః దానర్పించె రామార్థమై
యలఘుప్రాజ్ఞుఁడు, యుద్ధరంగముల ఛాయంబోలె వర్తించె, భూ
స్థలి సౌభ్రాత్రమిటుల్ పొసంగ వఁడా! స్వార్థంబు పూర్ణంబుగా
విలయింపై, పరమార్థమే నిలిచె నుర్విన్ దైవచిహ్నంబుగన్. 740

గీ. రామభద్రుని సేవనిరంతరంబు। స్వీయకర్మంబుగాఁగ నర్పించెదనువ్రు,
దల్లిదండ్రుల, దారసుతప్రభృతుల,। సరకుసేయఁడులక్ష్మణవరుఁడుఘనుఁడు. 741

గీ. భరతునెడఘనసౌహృదపాటవంబు। నెరపెశత్రుఘ్నుఁడనుశౌర్యనిధియతండు;
భ్రాతృవాత్సల్య సార ప్రభాగరుండు। వీరు రామానుజులు రణధీరులరయ. 742

గీ. రామరామానుజులు సార్వభౌమ సుతులు।భగవదవతారమూర్తు లీజగతిధర్మ
రక్షణార్థము పుట్టిరి దీక్షనెడి। పల్కు సత్యంబటంచనవచ్చుఁగాదె! 743

మ. రణరంగంబునఁ జచ్చినట్టి కపివర్యశ్రేణి యుద్ధాంతమం
దున నుజ్జీవితమయ్యె దైవఘటనన్ దోశ్శక్తియే పార దై
వ నియోగంబన నెట్టిదో పరమగోప్యంబౌను గాకున్న రా

ముని భార్యన్ దశకంఠుఁడు నింటఁ గడుఁబాముల్వెట్టె ధర్మంబొకో ! 744
చ. రణమున రామలక్ష్మణ ధురంధరు లోర్వక నాగపాశబం
ధనమున మూర్ఛమున్గఁ ద్వరితంబున నాఖగరాజువచ్చి యా
ఘనులను దేల్చెఁ గానివెడఁ గాయముఁబాసిరె యందు దిట్ట్రి సా
ధన లమితాద్భుతంబు ; లమృతంబును బోలె సుఖావహంబులౌ. 745
గీ. అద్భుతావహ సంఘటనాంశములను । విశ్వసించుట కఠిన మవేద్యమగుటఁ
జెలఁగు సప్తాదశ పురాణములనేక। చిత్రగాథలు మర్త్యవిశ్చేష్టితములు. 746
ఉ. గాధితనూజుఁ డోర్పున నఖండ తపోమహిమాఢ్యుఁడై మహా
యోధుఁ డనేక శస్త్రవినియోగ సుయోగములన్ గ్రహించి యా
యోధన సాధనంబుల ప్రయోగ రహస్యములెల్ల నీధరా
నాథునకిచ్చె నందువలనం గడిదేరిరి రామ లక్ష్మణుల్. 747
ఉ. దానవుల న్వధింపఁగల దార్ఢ్యము కల్గియు నట్టిశక్తులన్
మానులు పారమార్థిక ధనంబుగ నుంచి ధరాధినాథులం
బూనికఁ బ్రోత్సహించి పరిపూర్ణుఁ జేసిరి వారికీర్తి వి
ద్యానిధు లెట్టికార్యముల నైన నొనర్తురు లాఘవంబునన్. 748
ఉ. రాజుల యాధిపత్యము ధరన్నిరపేక్షపడి భారవంతయున్
యోజనచేసి మానులు పరియోజకత న్సమకూర్చుచుందు రి

క్లేజరుగుందపోధను లభీప్సితసిద్ధులు ; రాజయోగులున్
భూజనులం దరించునటు బ్రోతురు సక్రిమ శిక్షణంబులన్. 749

గీ. యోగ విద్యల నేర్చిప్రయోజకులయి। లోకములనుద్ధరింపఁగల్గుదురుఘనులు
వారిజన్మలు పరమ పావనములగును। దైవ విజ్ఞానవంతు లద్వైతపరులు.750

గీ. తాపసోత్తములే జనోద్ధారకు లిల। వారిమహిమ లెల్లెడలను వ్యాప్తములగుఁ;
బ్రకృతమునగాంధిలోకచక్రము నుద్రిప్పఁగలనుహాత్ముఁడై ధరణియందలరెఁగాదె

గీ. శరఁదపోధనులకు నసాధ్యములు లేవు। లోకములధర్మములనునిల్పుదురు వారె
రెండువైపుల వాడిగనుండు వారి। శక్తు లని దైవదత్తముల్ ముక్తిదములు.

గీ. ధర్మ సంస్థాపనార్థము దైవ మవని । జీవరాసుల జన్మించి ప్రోవవలెనె ?
యనుసమస్యను బూరింప నలవిగాదు। దైవవిజ్ఞాన మెటు సమర్థమగు దాన 753

మ. జగదాధారుఁడు మాతృగర్భమున సంజాతుండు కానోపునే?
భగవంతుండు నరావతారుఁడయి క్షోభంబందునే? యిట్టి నీ
చగతిం బొందఁగ నేల ? జ్ఞానమున నోజశ్శక్తి సంపూర్ణుఁడిం
పుగ సృష్టిందగఁ జేయలేఁడె ? యనుటొప్పం గాని, దుర్బోధమా. 754

చ. అలజనకాత్మజల్ దశరథాత్మజులన్ వరుసన్వరించి, రా

చెలువము గాంచ శక్యమె ప్రసిద్ధ కులంబులు రెండు, వీరుని
ర్మలులు, పరాక్రమోద్ధతులు ప్రాజ్ఞులు, వీరికి దుల్యులైన భా
ర్యల సమకూర్చి ధాత జనరంజకుడయ్యెను సృష్టి సేర్పగన్. 755

ఉ. రావణకుంభకర్ణులన రాముని భృత్యులు తొంటి పుట్టువన్
దైవిక శాపహేతువున దానవులై జనియించి ఘోర యు
ద్ధావని దేహముల్ విడి రయంబున స్వర్గము జేరి పూర్వపున్
సేవల విష్ణుదేవుని భజించుచు నుండిరి శాశ్వతంబుగన్. 756

గీ. సప్తభవముల సౌఖ్యప్రసక్తినైన । మూడు భవముల వైరుధ్యముననునైన
శాపమోచనమనమూడుజన్మములనె। వైరమునఁజచ్చుటకు వారుకోరుకొనిరి.757

ఉ. శ్రీహరి మూడుసార్లవని, చిత్రముగా నవతారమెత్తి, స
మ్మోహనరీతి దానవ తమోమయ లోచుం జరించు వీరులన్
ద్రోహులుగా వధించి, యమరుల్గన శాపవిమోచనంబు ని
ర్వాహకుడై ఘటించె బవరంబున వీరల నాత్మభృత్యులన్. 758

గీ. రావణుని చేతఁజిక్కిన రమణి సీత । కాదుమాయాప్రకల్పిత కాంతయనెడి
వాదమొక్కటికల, దంచువలనద్రోహ। వైఖరియె పోవుదానవశేఖరునకు. 759

గీ. శాపవశమున హరిచేతఁ జచ్చెఁగాని । సిరికి ద్రోహము నెంచునే సురవిరోధి?
మాతృభావంబుతోఁదనమందిరమున। డాచియుండును బ్రభునికటాక్షమునకు. 760

గీ. సకలజీవుల దైవమే చంపు, నతఁడు। స్వయముగావచ్చి రావణు సంహరించె,
నది యెఘనతకుఁదార్కాణమగునుగాదె! । దానవులు దైవభక్తితత్పరులు ధరణి.

ఉ. రావణకుంభకర్ణ రణరంగమునన్ రఘురామలక్ష్మణుల్
దైవసమాను, లస్త్రసముదాయ పరంపరఁగుప్పి, దైత్యసం
భావనఁజేసి రౌద్రరస వర్షమునన్ వడిముంచి, రాక్షసో
జ్జీవములన్ హరించిరి ప్రసిద్ధగతిన్ విలసన్మహోద్ధతిన్. 762

చ. పరసతి పొందుఁగోరి పరిపాటిగ నాశనమందు వారలెం
దఱోకల, రందు రావణకథం గలకాలము సంస్మరించి, ధ
ర్మరతిఁదరింపనోపు; రఘురాముని యేకసతీ వ్రతోద్యమం
బరయ స్వధర్మమాను, నిరయంబునఁగూల్పదు, యోగ్య మార్గమా. 763

గీ. రామరావణు లిర్వురు రాజులగుట। సకల శస్త్రాస్త్ర సాధన చతురు లగుట
దారుణంబయ్యెఁ గదన విచారణంబు। రాక్షస ప్రవీరులకు దుర్వహము నయ్యె.

చ. జనకుఁడు రాజయోగి నృపచంద్రుఁడు, సర్వజనానురాగ సా
ధన చతురుండు, సీత వసుధాసుత, రాముఁడు విష్ణుమూర్తి, యీ
ఘనజనసంపుటిన్ దనుజకాంతుని జీవన మంతరించెఁగా

చేనఁటి వరాంగనాజన వశీకరణాఘుఁడు ద్రుంగుటబ్రమే ! 765

ఉ. సీతయు, రామలక్ష్మణులు, సిద్ధ కపీంద్రులు, నాంజనేయుఁడున్,
భ్రాతృవినాశ కారకుఁడు భద్ర విభీషణుఁడున్, మునుల్, సురల్,
క్షోఁతులు, గొండముచ్చు, తెలుఁగుల్, ఖగముల్, బవరంబునందు, సా
కూతమతిన్ సమిష్టిగను గూల్చిరి రావణదానవావళిన్. 766

ఉ. ఈశ్వరు చిద్విలాసకృతు లెల్లజగంబుల నెల్ల వేళలన్
శాశ్వత చక్ర చంక్రమణ శక్తి పునఃపునరాగతంబుగా
నశ్వరతన్ భ్రమించు తరుణంబుల నెందఱొ రామరావణుల్
విశ్వపరీతకాల సమలిప్తల వచ్చిచరించి పోదురో ? 767

గీ. భగవదవతార మూర్తులే వగలఁబొగిలి।దుఃఖభాజనులై దొప్పదోగుచుండఁ
బామరులమాటఁజెప్పఁగ వశమె ధరణి?।జన్మమే దుఃఖభార భాజనముగాదె!

ఉ. ధర్మము ధర్మమన్న నిజధర్మము మేదిని గానరాదిఁకే
కర్మమొ యావరించి క్షణికంబున నాహుతిఁజేయు సర్వమున్ ;
నిర్మలుఁడైన రాముఁడవసం బలుపాటును జెంది స్రుక్కె, నీ
మర్మము బ్రహ్మభేద్యమగు, మానవ కోటికిఁ జిక్క దెన్నఁడున్. 769

గీ. దైవమెన్నఁడు భువినవతార మెత్తి।మానవుల కష్టసుఖముల మ్రగ్గవలయుఁ ;
బాంచభౌతిక దేహ సంబంధగతులు। తప్పక యెపో యెమానవదైవమునకు 770

మ. తలిదండ్రుల్, సహజుల్, సతీసుతులు, భక్తవ్రాత, మెన్నెన్ని బా
ధల పాలైనను, రామచంద్రుఁడు మహోదారుండు వారింపకే
కలఁతం జెందె నశక్తతన్; స్వయముగాఁ గష్టంబులం జిక్కె; భూ
స్థలి జన్మంబుల నెత్త దైవమును బాధల్ జెంది శోషింపఁడే ? 771

మ. భగవద్వాయువు చేరఁ జేతనము సంప్రాప్తించి జీవాత్మయై,
విగతాత్మన్ మృతమాను దేహము, సముద్వేగం బడంగుం గదా !
జగతి న్వేఱుగ జన్మమెత్తవలెనా ? సత్యంబు సాధింపఁగన్ ?
మృగపక్ష్యాదుల సానుభూతిగను ఁటీతిన్ సమర్థింపనా. 772

ఉ. దానవ వీరవర్యులఁ గదల్చెడి చేతన మీశ్వరుండె యై
పూనికఁ దన్నుదాఁ బ్రథనభూమిని జంపఁగ జన్మమెత్తె సం
ధానము చిత్రమౌఁగద! వదాన్యుఁడు బెబ్బులియై మృగంబునై,
ప్రాణులు ప్రాణులన్మెసవు పద్ధతిఁ గూర్చుటయు న్విచిత్రమౌ. 773

ఉ. రాముని యంతరాత్మయును రాక్షసవీరుల యంతరాత్మలుం
గోమల దైవతత్త్వమె యగుం బరమాత్ముఁడు రెండురూపులం
దామసవృత్తి వైరపరతంత్రతఁ జచ్చెనొకండు, చంపెనా

రాముస్మరించు చోక్క(డను రాగము వీడి దురాగ్రహంబునన్. 774

గీ. ధర నుపాధులెన్నైనఁ జైతన్యమొకఁడె। దేవదానవ భేద మాత్మీయమా నె ?
జనన మరణంబు లాత్మసంచలనములగు। రామరావణ యుద్ధ మర్మంబు లీల.

గీ. ఛాయవంటిది జీవంబు చావు చంపు। ఒకిల లొంగదు; ముమ్మారు రాఘవుండు
రాక్షసునిఁజంపి మోక్షసామ్రాజ్యమిచ్చె। జీవపరమాత్మలీరీతిఁ జెలఁగుచుండు 776

గీ వీరపురుషుఁడు జానకీవిభుఁడుఁ ఘనుఁడు। యుద్ధ రంగంబులందుఁ బ్రసిద్ధుఁడరయ
భారతీయుల యౌన్నత్య పదవులిట్టి। వారి బాహుబలము చేతఁ బ్రతిభఁగాంచె.

చ. అమరులు దేవతా ప్రవరు, లందుఁ ద్రిమూర్తులు, వారి భార్యలు
త్తములుగదా ! మహేశ్వరుని దార స్మృతింగను టెట్లుగూడదు? న
నబ్రమునగజాతయాట పిదపం దహమూని శివున్వరించు తం
త్రముఁగనఁ దారకాసుర వధా ప్రతిపాదకమౌను, రాఘవా ! 778

శా. శ్రీరామా ! జననీపిచండ జనితాసృక్స్వార కూపంబునం
బ్రారంభంబున మున్గి, తీవ్రనరక ప్రాయంబుగా ఖేదమా
రా రా ! పొందితివీవు జీవసముదాయ ప్రక్రియన్ ; దైవ స
త్సారంబేమియు లేకపోయెఁ బరతత్త్వప్రిజ్ఞ వమ్మయ్యెనే ! 779

శా. భూకంపంబులు, సగ్నిపర్వతము, లంభోరాసులుప్పొంగి, హా
హాకారంబులఁగూర్చుటల్, మరిడిమారీమారి బాధ్యంబులున్

శోకం జేసిన దానవుల్ క్షణములో శుష్కించి చల్లారరే!
శ్రీకళ్యాణ గుణాకరుండవు గదా! శ్రీరామచంద్రప్రభూ! 780

ఉ. వెన్నుని సన్నిధాన వరభృత్యుల నెవ్వరో వే శపింప నా
పన్నత వారిమెబడి, విపత్తులఁజిక్కిరి వేమిపాపమో?
పన్నగశాయి! భక్తపరిపాలన కింకొక దారిచిక్కదే?
నన్నును నీవు నట్లె కరుణంగని బ్రోవుము రామచంద్రమా! 781

చ. జయవిజయాఖ్యు లెట్టి పరిచర్యలఁ జేసిరో? రామచంద్ర! దా
పయి కరుణించినావు సురలందఱు మెలఁ; బామరుం దయా
మయ కృపఁబ్రోవరాదె! పెరిమం బరమాత్మవు, దేవ నన్ను, సం
శయపడ నేల? జీవుఁడ భుజంగకవిన్ భవదీయ భృత్యుఁడన్. 782

ఉ. రాముఁడు దారుణాస్త్ర రణరంగములందు భయంకరుండు, స్వ
ర్ధాముఁడు భక్తిమార్గ పరతంత్రుల ముక్తులఁ జేయుటం, బరం
ధాముఁడు సర్వలోక సుజనస్తుతిశాలి, వసుంధరైక సు
త్రాముఁడు, జానకీధవుఁ డుదారుఁడు నన్ను దరింపఁ జేయుతన్. 783

గీ. రామరామానుజులపరాక్రమము ఘోర । దానవేశ్వరహృదయవిదారణంబు,

భక్తజన మానసోల్లాస వర్ధనంబు,।మునివరేణ్యుల కైహి కాముష్మికంబు.784

ఉ. జీవుల రక్షణార్థము ప్రసిద్ధిగ జన్మములెత్తివట్టి యా
దైవము సత్యపాలన విధాన ధురంధరమూర్తి నన్నుసం
భావనచేయలేఁడె! తనభక్తులలోన నొకండఁగానె! సన్
బ్రోవఁగలేని ప్రాభవము వూథముగా దవతార మూర్తికిన్. 785

గీ. సతికి రాక్షస గృహనివాసము నుమచ్చు। తల్లి కైహిక విధిని వైధవ్యదశయుఁ
బుత్రశోకంబుతండ్రికిఁబొందుసడి యెఁ।దప్పదయ్యెనురామావతారమునను. 786

చ. దశరథరాజపుత్రుఁడవు, దానవులన్ విరథుండవైయనిన్
దశముఖుత్రోడఁ జంపితివి, తావక బాహుపరాక్రమంబిలన్
దశదిశలన్వెలింగె నిరతంబు; మహారథు లంతమాటచేఁ
బ్రశమితమయ్యె రావణ దురాగత ఘాతుక చర్యలన్నియున్. 787

ఉ. పాయక శంఖచక్రముఖ భాసురుఁడుంగరుడాధి వాహనుం
డై, మొదుటం దటిల్లసిత సంబుజగేహిని గూడి సల్లనో
త్రోయదమట్లు భాసిలు చతుర్దశ విష్టప నాథుఁడైన నా
రాయణుఁడేల నన్ను బరిరక్షణ సేయఁడు? దీన మానవున్. 788

క. రామవర్ణోచ్చారణమున। వేవెడలు న్ముఖమునుండి వృజినగణం బా
త్రోవ నుగుడి రాకుండన్। మావర్ణము తత్కవాట మహిమ న్నెగడున్.789

గీ. ఆనతులు సచ్చిదంబుధి హంస! నీకు। నానతులు రఘువంశ పూతాత్మ! నీకు,
నానతులు సర్వపాప సంహార! నీకు। నానతులు సత్యధీవృత్తు లరయునీకు. 790

## భక్తివైరాగ్యములు.

ఉ. దైవమె లేనిచో నఘము దార్కొన దాస్తికుఁ బ్రార్థనాదులన్ ;
దైవమె యున్న నాస్తికుఁడు దండనఁజెందు నసంశయంబుగం,
గావున భక్తిమార్గమె యఖండ మహద్దశఁగూర్చు సద్గుణ
శ్రీవిలసిల్లు మానవుని జీవితము న్సఫలం బొనర్చెడున్. 791

చ. పరులకు హానికాని విభవంబుల నందఁగవచ్చు స్వేచ్ఛగా,
ధరణి సమస్తజీవ సముదాయము నాత్మగ నెంచనొప్పెడున్,
నరులకు ఘాతనెన్నఁడు మనంబున నెంచక దైవభక్తితో
వరలినవాఁడు ధన్యుఁడనవచ్చు ధరాస్థలి జ్ఞానవంతుఁడై. 792

గీ. సృష్టి వైచిత్ర్యములనెల్లఁ జెనఁకఁగలమె?। దైవమేకర్త యన్నతత్త్వంబు నమ్మి

భారమంతయు నతనిపై వదలివేయు।జిత్తవిశ్రాంతి కలుగు విశిష్టముగను.793

గీ. నామరూపంబు లీశ్వర ధామములగు,।నెవ్వ రేరీతిఁ దలఁచిన నేమి కొదువ?

ఆస్తికతయే ప్రధానాంశమఖిలజగము।లతనివిశ్వరూపమునం దెయమరియుండు.

గీ. ఆకసమునుండి వర్షించు నంబురాశి। సాగరంబునఁ జేరెడి చందమునను

సర్వదేవ నమస్కార సమితి దైవ।మునకె చెందు సకలమతములును నిట్లె 795

గీ. భక్తి వైరాగ్యములు రెండుఁ బట్టుకొమ్మ।లవ్వియే చాలును జనుల కాదృతినిడ,

రాగములపట్టుసడలు వైరాగ్యమునను।భక్తిచేఁ శ్రమలును దైవపరములగును.796

గీ. క్రీస్తు తనబోధనల నాచరించి చూపె,। నిర్మలప్రేమ నాదర్శనిధి యతండు;

జగతి నవతారపురుషులు సములు కారు।పరమభక్తుఁడు జగదేక పావనుండు.797

ఉ. క్రైస్తవ సాంప్రదాయము విలాసపరంబగు నెల్లవారికిన్;

వాస్తవభక్తి విశ్వసన భావన సత్యవిశుద్ధ జీవనో

పాస్తులఁగూర్చు నిర్మలిన వర్తనచే భగవత్సమీప ని

త్య స్తవసంపదల్ గలుగు, నయ్యది భాగ్యముగాదె! జీవికిన్. 798

చ. తనయుఁడు రొట్టెఁ బెట్టుమనఁ దా శిలనిచ్చునె యెవ్వఁడేని? జేఁ

పను దనకిమ్మటంచడుగఁ బాము నొసంగునె? మీరు దుష్టులై

తనయులకీయ నుత్తమ పదార్థములం బరలోకవాసి మీ

జనకుఁడు నేఁడు మీకు నిడఁజాలఁడె ! తప్పక మేలి యీవులన్. 799

చ. నను బ్రభువా యటంచు వదనంబునఁ బల్కెడు వారలెల్లరుం
జన రురులోక సంస్థితికి, సత్యముగాఁ బరలోకవర్తి మ
జ్జనకుని చిత్తవృత్తిఁ గని సల్పెడువాఁడట కేగు; నంచుఁ గ్రీ
స్తను దినము న్వచించె, మదినారయుఁ డిందలి తత్త్వసారమున్. 800

గీ. ధరణి సలిలార్ద్ర ఘాసంబుతగులఁబడదు। భక్తివైరాగ్యములుగలవాఁడు చెడఁడు;
జ్ఞానవంతులమనిగర్వమూనువారు। చూచుచుండియుభక్తులసొంపుఁగనరు. 801

గీ. వస్త్రమును రంగునీటి లోపలను దడుప । బట్టకారంగు పూర్తిగఁబట్టునటులు
నరులుసత్సంగమునజ్ఞానపరులగుదురు। విగతవిషయాభిలాషులై వెలయుచుండ్రు.

ఉ. వాస్తవభక్తితో సకలభారము దేవునిమీఁద వైచి భ
క్తిస్తవసంపదన్ దృఢమతిన్, నిరతిన్, స్వమతిన్ భజించినం
బ్రస్తుత భారమంతయును వానిదగు న్మది విశ్వసించినం
గ్రైస్తవ సాంప్రదాయమిది రక్షకుఁడే భరియించు బాపముల్. 803

గీ. విగ్రహారాధనం బల్పవిదుల కనియు। సక్రమాభివృద్ధిని బైకిఁజనెదరనియు
ననెద రదియె యభ్యాసమానందువలన। సహజవిజ్ఞానముడఁగిదుస్సాధమగును.

గీ. హర్షశోకంబులెల్ల బ్రహ్మార్పణమని। సాక్షిగానుండి కలుగు వాసనలచేత

సంస్కృతిని వెళ్ళఁబుచ్చు నిష్కామి లోక। సంగ్రహార్థముపని చేయుసాధువగును.

ఉ. నావలె మీరలందఱు ఘనప్రభు పుత్రులు, దేవు చిత్తముం
బావనతన్ రచించుటయె భవ్యము; మానవ సౌహృదంబు జీ
వావన ధర్మమౌనని ప్రియంబుగఁ గ్రీస్తు వచించె, నద్దియే
దైవము సృష్టియందు మన ధర్మముగా నియమించె భూస్థలిన్. 806

గీ. అనుదినంబును స్నానంబు నాచరింప। దేహ మాలిన్యమెల్ల గతించునటులు
దైవ నామస్మరణము నిత్యమును జేయఁ। జిత్త పారిశుధ్యంబున జీవి తనియు.

గీ. ప్రబలసంసార మిహికావరణమునందు। మొదట నుల్లాసజనకంబు, పిదప మధుర,
మంతమున మోక్షదాయక మగుచుగాదె!। భగవదారాధనం బెట్టివారికైన. 808

శా. రాగద్వేషములం బ్రయత్నమునఁ బూర్ణప్రజ్ఞ వారింపఁగా
భోగేచ్ఛల్ సుఖదుఃఖముల్ కడకుఁబోవున్ నిర్మలస్వాంతమౌఁ,
యోగంబియ్యది రాజయోగ్యమగు ధైర్యోత్సాహముల్గూల్చు, వి
ద్యాగంధంబుఁ బ్రవృద్ధిఁజేయుఁ బరమాహ్లాదంబుఁ జేకూర్చెడున్. 809

గీ. నావ నడుపంగ నేర్చిన నరుఁడె నదిని। దాఁటఁగల్గును, వ్యర్థుఁడు దాఁటలేఁడు;
ప్రాజ్ఞుఁడగువాఁడె సంసార వారినిధిని। దాఁటు నజ్ఞాని యేరీతిదాఁటఁగలఁడు?

గీ. బుద్ధి నుత్తమస్థితియందుఁ బూనినింపి। పరమ వైరాగ్యమును దనవశముచేసి
త్యాగియై హరసేవ కాదక్షి యగుట। యే పరాత్పరు కైంకర్య మిద్ధరిత్రి. 811

ఉ. భోజనకాలమందుఁ దిను ముద్దకు ముద్దకుఁ దుష్టిపుష్టి యు
త్తేజము క్షున్నివారణ ముదీర్ణతఁ జేకురుభంగి దైవస
త్పూజయు నేకకాలమున భూర్వహాభక్తి విరక్తి శక్తులన్
రాజిలఁ జేయు జీవునకుఁ బ్రస్ఫుట ముక్తిపదంబుఁ గూర్చెడున్. 812

గీ క్రీస్తు సంసార బంధముల్ ద్రెంచి వైచె। బాల్యదశయందె దైవ ప్రపత్తిహత్తెఁ
గన్నతల్లిని దలఁప కుగ్రముగ దైవ। భక్తులే పితరులనుచు యుక్తిఁబలికె. 813

గీ. అనలజనిత స్ఫులింగము లగ్ని నెవరఁ। జాలనట్టులు దైవాంశ జాత జీవు
లాత్మశక్తి నెదురొ్కన నలఁతులగుదు। ప్రభుఁడు పరమాత్మ జీవాత్మ భక్తుఁడగుట.

గీ. ఈషణత్రయముల మనకెంత ప్రీతి। కలదొ పరమాత్మయం దంత గాఢభక్తి
కలిగి యుండిన యెడ మనకష్టసుఖము। లాతఁడే తీర్చుఁగాదె యహర్నిశంబు 815

చ. మన ఋషులెల్లఁ గైస్తవుల మాదిరి నిండ్ల సతీసుతాదులన్
ఘనముగఁ గల్గి తాపసవికాసము నందిరి; సన్న్యసించువా
రనఘులు కొద్దిమంది; పరమాత్ముని నాత్మగ నెంచు ధీరులే
వనమున నింట నుండిన శుభంబగు వారికి ఖేదమంటునే ? 816

చ. భ్రమర మనేక పుష్పములపై దిగి తేనెను గ్రోలునట్లు సం

భ్రమమున సర్వశాస్త్రి సముపార్జనఁ జేయుచు సారమంతయుం
గ్రిమగతి. గ్రోలు, దుర్విషయ రాగములన్ విగనాడు యోగ్యుఁడ
శ్రిమముగ ముక్తిమార్గము నజస్రముఁగాంచు నభీష్టసిద్ధికిన్. 817

గీ. వెల్లు జలములఁ దెచ్చిన హెచ్చుఁగనక । యెండిపోయిన క్షీణింపకుండుఁ గడలి
నైకవశిని మాని కష్టసుఖముల నంట । కాత్మతత్త్వావలోకన మందె నిలుచు. 818

గీ. పరమ దుర్మార్గులగువారి ప్రహరణార్థ । మవతరించెను దైవమాడార్యజనులు;
పాప సంరక్షణార్థము వచ్చెఁ గ్రీస్తు, । చూడుఁ డాదర్శ భేద మహాత్మ్య మలర.

గీ. అవని నజ్ఞానమే పాపమనఁబడు నది । సృష్టితోఁ గూడ నుద్భవించినది దైవ
భక్తి వైరాగ్యములచే నివర్తితమగు; । సకల మతతత్త్వ సారపరిచార మిదియె.

ఉ. ఆదిని సృష్టిసేయు సమయంబున దైవము జీవజాతులన్
భేదములెన్ని గూర్చె నవనిం గడు వృద్ధిని జెందె సర్వియే;
యాదటఁ గ్రొత్త జాతి యొకఁడైనను బుట్టదు గిట్ట దిట్టి భా
గ్యోదయశక్తి యీశ్వరుని కొప్పు నయింపవు శూన్యవాదముల్. 821

గీ. చిత్రి సటసంబుఁగావించు చిన్మయునకు । జిత్తుజడమును జడమును జిత్తునెను
భ్రాంతిఁగలిగించునొక గొప్పశని యె! చిద్వి । లాసమున కెట్టిశని నైన వాసిఁ జేయు

క. దేహమునకు బీజ శరీరము । పావనుఁడగు దైవ మహాత్మ వసుధం బీజకున్;
దైవముఁ బీజయును నవినా । భావంబున మెలఁగ సృష్టి వర్ధన మొనయున్.

క. కనిపాటలఁ జక్కఁగఁ జే । సిన భుక్తియు, దేహపుష్టి చేకురు, దైవం
బును జిత్తంబున నెలకొ । ల్పిన మానవ జీవితము పవిత్రతఁ గాంచున్. 824

క. కొందఱు విద్వాంసులుగా । నుందురు, పామరుల కెట్లు లొప్పును తత్త్వం;
బాదఱకు భక్తిహృదయా । నందంబై ముక్తి నొసఁగు నౌక యగుఁగదా. 825

క. చెలఁగు మనోవాక్కాయం । బుల ద్రోహాభావ భావమున మహి జీవా
త్ముల స్వీయాత్మగ మననమునఁ । దలఁచెడి భక్తుండు దైవతత్పరుఁ డరయన్.

ఉ. మానసమునందు గొప్ప మహిమందగు శక్తి లభించు, శూన్యమౌ
మానసమందు దైవము క్షమన్ నివసించును, లౌకికంబులౌ
మానవు చిత్తమందు క్షణమాత్రము నిల్వవు, ముక్తికాంత స్వా
ధీనము గుం, బరాత్పరు మదిం గదియించిన వార లుత్తముల్. 827

గీ. అనుదినంబును ఘటికాద్వయంబు మౌన । ముద్ర నిర్వికల్ప సమాధిమున్ని పిదప
లోకసేవాపరాయణో ద్రేకుఁడగుచుఁ । గాలమునుబుచ్చునరుఁడు నిక్కముతరించు.

గీ. భక్తి విశ్వాసజనిత ప్రపత్తి యగుట । దృష్టి పరలోకమందు సంధించి, జీవి
మైహికంబులసరకుసేయక యెమసల । వలయునది రాజయోగతత్త్వముసఁబఱును

క. మనవలె నిడుములఁ గుడి చెడి । మనుజాలకున్ జీవతతికి మనుగడ నెరపన్

మనశ్శక్తి కొలఁదిఁ దోడ్పడఁ। జను, దైవము తృప్తినందు సత్కర్మమదే. 830

క. మానవ హృదయారామ మ। నూనముగా శుద్ధిజేసి యుంచిన దేవా
స్థానంబై సార్థకమగు। మానవప్రాణములఁగాచు మాన్యుండగుటన్. 831

క. ఇది న్యాయదియను తలఁపున్। మదినిల్పిన నది యసత్య నటనంబగుటం
దుది మోసంబగు నెప్పుడో। చదువును శోకంబుగూర్చి సంయమినైనన్ 832

గీ. అజగర వ్రతంబూని యాహార విహార। ణ శయనములను దైవ సందార్గితములఁ
దృప్తినందుచుఁ, బారమార్థికమునలుపు। మానవుండిలమోక్షసామ్రాజ్య మేలు.

ఉ. వ్యక్తుల భేదమోద విలయంబుల నెంచక విశ్వపాలనో
ద్యుక్తిఁ దలంప జీవులు మహోదధి కైవడి వచ్చిపోవుటే
యుక్తము, దైవశక్తికిఁ బ్రయోజకమౌ, రణరంగ రీతిగా
ముక్తి క్షణంబులోఁగలుగు బ్రొక్కి-భజించిన భక్తకోటికిన్. 834

మ. ప్రతిజీవాత్మయు నొక్క-సంస్కృతినె యోర్వంజాల నాద్యంతస్య
ఖిత జన్మంబును బుచ్చుచుండఁగ నయో! భేదాకులంబైన జీ
వితముల్ గల్గు ననంత జాతముల నుద్భవంబుట్టి దైవంబు భూ
తతతిన్ బ్రముగ్గుచు నట్టి లీలల స్వతంత్రప్రజ్ఞఁ బూరించునో! 835

గీ. వృక్షములు స్వీయఫలపుష్పవితతిననుభ। వించక యొభూతతృప్తికర్పించునటులు
నరులుత్తమజీవితముఁను బరులసేవ। యందు వెచ్చించికృతకృత్యులగుట మేలు,

గీ. మర్కటకిశోర మేరీతి మాతృగాత్ర । ము నవలంబించు జ్ఞానవిస్ఫూర్తిఁగాంచె?
దైవమే సమకూర్చుఁ దత్తదుపయుక్త । గతులఁ బుట్టించు నపుడు జీవతతికెల్ల.

క. మరణం బెప్పుడొ వచ్చున్ । శరీరికది యుత్తర క్షణంబున నేమో;
పరమేశ్వరు నెదనిలుపక । పరాకుపడియుండగా దభద్రంబ యగున్. 838

క. పరపీడనమే పాపము । పరోపకారమె తలంపఁ బరముపవిత్రం
బరయఁగ సజ్జన సేవా । పరాయణునియందు నిల్చు భగవంతుఁ డిలన్. 839

క. పౌరుషమును దైవంబును । జేరికఁగనఁ గార్యసిద్ధి చేకురు ధరణిన్
వేఱయిన నిష్ఫలంబగు । సారస మినదీప్తిఁగనక నసిచెముఁ గాదే! 840

ఉ. నైతిక ధర్మశాస్త్ర పరిణామము సంఘ సుఖాభివృద్ధికై
భూతలమందుఁ గూర్చెదరు పూజ్యులు, దైవము సేతకాదు, త
జ్జాతుల కేక కాల మతచర్యలఁబట్టి రచింతు, రవ్వియే
రీతిని గూర్చుముక్తిని! దరింపఁగ భక్తియె శక్తిమంతమౌ. 841

క. బలవంతుఁడైన దైవము । ఫలాఫలంబులను గూర్చుపట్టున ధర్మ
స్ఖలనముఁ నుఁ బరిగణింపఁడు । ఫలంబులను గోయువాని పద్ధతిఁ ద్రుంచున్. 842

ఆ. దండనాధికారి తప్పుఁ జేసినవాని । కష్టసుఖములఁ బరిగణన సేయ

నటులు దహరుజల నాత్మగణింపఁబో । దెద్దపుండు కాక కేమి మున్నా? 843
చ. తరు నగ లోహ కీట వివిధ క్రిమి జంతు నరావతార సం
భరితుఁడు జీవి, యూర్ధ్వసురవర్తన మెంత ఘనంబొ దాని సం
చరణ మగమ్యగోచర దశన్విలసిల్లుచునుండు నెంచఁగం
బరమపవిత్రధర్మము లసంజను నావిభు చిద్విలాసముల్. 844
ఆ. వేరు నాటినట్టి వృక్షంబునకు జలా । హారమూను గూర్చు నదియె, యటులు
జీవి దైవమందు స్థిరతఁ గాంచ నతండె । మూల కందమగు సమోఘముగను.
శా. ఈజ్ఞానం బతిసూక్ష్మమౌట ధరలో నే కొందఱో గాని యీ
ప్రాజ్ఞత్వంబు వహింపఁజాలరని లో భావించి ప్రాచీన స
ర్వజ్ఞుల్ భక్తిని రాజమార్గమని తత్ప్రారంభులై యుండఁగం
బ్రజ్ఞానుల్ క్రమముక్తులొందురని సంస్థాపించిరీ భూమికన్. 846
గీ. ఎల్లవారికి సులభమై చెల్లుత్రోవ । మోక్షసామ్రాజ్య మొదవించు మూలధనము
మనసు పెడదారిఁ బోకుండ మలచువాని । లేని భక్తికి జాలు ప్రసాద మొకటి. 847
క. ఆరాధ్యుఁడు తత్త్వాసా । దారాధ్యుఁ డగును గాక యన్యుఁ డగునే?
ధారణి భక్తికి ముక్తికి । నారయఁగా భేద మొక్క యంతయు గదా! 848
ఉ. కానఁగలండు దైవమని గాఢతరాస్తిక వాదలోలుఁడై
యీ నిఖిల ప్రపంచమును నీశ్వరు దివ్యకళావిలాసమం

చానత భక్తియుక్తిఁ బులకాంకుర గద్గద సమ్మదాశ్రు ల
క్ష్మీనత సుప్రవృత్తిలఁగ భజించుట ముక్తిపథంబుఁ గాంచుటే. 849

మ. భగవంతు న్నిఖిలప్రపంచముల నుత్పాదించి పాలించు స్వా
మిగ భావించి భజించు సాధకుఁడు భక్తిమార్గము సత్పురు నా
భగవచ్చిత్కళ తెల్లజీవులును బోల్పన్ జీవుతే దైవమం
చుఁ గృతార్థత్వముకై నెఱుంగు టసపచ్ఛున్ జ్ఞాన మార్గంబిలన్. 850

ఆ. ఆత్మశుద్ధినొంది యద్వైతభావనా । శక్తిఁ గందు రేని జ్ఞానులగుదు,
కాకయున్న లోకకల్పనా సామ్రాజ్య । పట్టభద్రుఁ జేరి భక్తు లగుదు. 851

క. ప్రతి పద్యంబును నిర్మల । మతి సవలోడనము సేయు మహితార్థము లు
ప్పతిలు ననంతములై హృ । ద్గత సందేహము లడంపఁగల దీ కృతియున్. 852

— / గద్య. / —

గీ. తత్త్వ మీమాంస జ్ఞాపకార్థముగ మొదలు । జేసితిన్ బహుధాన్యాది మాసశుక్ల
పక్షపుఁ జతుర్దశిని భాను వాసరమునఁ । జిన్నమాదేవి మరణవార్షికము నాఁడు.

క. నిజ తాత్త్వక మీమాంసన్ । సృజించె మంత్రి ప్రెగడ లసిత వంశజుఁడౌ
సుజనవిధేయుఁడు రాజా । భుజంగరావు పరమార్థముగ నేలూరన్. 854